# వరవస్తుభట్టు

చారిత్రక సాంఘిక నాటకము

ఆంధ్ర విశ్వవిద్యాలయమువారి 1960 సం॥ నకు బి. ఏ
పరీక్షకు పఠనీయ గ్రంథము.

[illegible]

శ్రీ వింజమూరి వేంకట లక్ష్మీనరసింహారావు.

[illegible]

శ్రీ [illegible]

ప్రకాశకులు :

అనసూయా పబ్లికేషన్స్. మద్రాసు 17.

# రెండవ కూర్పునకు పీఠిక

"నరసన్నభట్టు" మొదటి కూర్పు అచ్చుపడి వెలువడిన మరునాఁడే. దాని ప్రతులను ఆంధ్ర విశ్వవిద్యాలయమువారికిఁ బంపితిని. అందలిగుణ మల్పమేయైనను, వారు దానిని గ్రహించి, 1960 సం॥ రము మార్చిలో జరుగు బి. యే. పరీక్షకు పాఠ్యనాటకముగా నియమించి, నన్ను గౌరవించిరి. వారికెంతయుఁ గృతజ్ఞుఁడ. 1934 సం॥ రపు బి. యే. కు నా "అనార్కలీ" నాటకమును పఠనీయగ్రంథముగా నియమించిరి. ఇప్పుడు మరల నింకొక నాటకము నాది గ్రహించినందులకు సంతోషించుచు, బోర్డ్ ఆఫ్ స్టడీస్ వారికి కృతజ్ఞతఁ దెల్పుచున్నాను.

గ్రంథకర్త.



Sree. T. V. Raghaviah, A.F.I.I.
(Zamindar, Ampapuram, Chinalingala etc Estates)
Retired Assistant Secretary, (Developement)
Life Insurance Corporation of India,
Southern Zone, Madras.

# మున్నుడి

పీఠికాపుర సంస్థానాధీశ్వరులగు శ్రీరావు గంగాధర రామారావుగారి ఆంతరంగిక కార్యదర్శిగా మా తండ్రిగారు, బ్రహ్మశ్రీ లక్ష్మణశాస్త్రిగారు చాలకాలముండిరి. ఆ దినాలలో సంస్థానోద్యోగులలో ఆంగ్లభాష తెలిసినవారు మా నాన్నగారొక్కరే. ఆయన, గంగాధర రామారావుగారి కోరికపై "The History of Rao Family and Vinjamuri Family" అను పేరున మా యుభయ వంశాలను గురించి కాలక్రమాన్ని తెల్పుచు, ఆంగ్లమున నొక గ్రంథము రచించి, సుమారు 80 యేండ్ల క్రిందనే అచ్చు వేయించిరి. అందు నరసన్న భట్టు గాథ సంపూర్ణముగ నున్నది. దానిని కథావస్తువుగాఁ దీసికొని, కొన్ని కల్పనలు చేసి, నే నీరూపకమును రచించితిని.

నా మామగారు బ్రహ్మశ్రీ దేవులపల్లి వేంకటకృష్ణశాస్త్రిగారున్నూ తదాస్థాన కవీంద్రుఁడుగా నుండి, "రావువంశముక్తావళి" అను ప్రబంధమును ఆంధ్రమున రచించిరి. అందుఁగూడ ఈ గాథ కొంతవఱకుఁ గలదు. ఆగ్రంథమునుండి నాకు మిగుల సహాయ మొనర్చినది.

ఈ నాటకమందలి యితివృత్తము చారిత్రాత్మకమే; క్రీ॥ శ॥ 14వ శతాబ్దాంతరమున జరిగినకథయని తోఁచుచున్నది. మాధవవర్మ ఆకాలమువాఁ డందురు. అయినను రసపుష్టి కోసము కొన్నికల్పనలు చేసితిని. నరసన్నభట్టును వెలివేయుట జరిగినదో లేదో నాకుఁ దెలియదు. అది ఛాందసయుగము కదా! శూద్రస్త్రీ చేతి యన్నముతిన్న నరసన్న నాదినాలలో సంఘమునుండి బహిష్కరింపక యుండరుగాని అతఁడు మహాపండితుఁడు గనుకఁ దానొర్చిన పని తప్పుగాదని సర్వవిధాల సమర్థింపక యుండరుగాని అని యూహించి, ఆ వెలి రంగములను కల్పించితిని. నరసన్నభట్టు నిల్లు, ఒక గుడిసెయే యని రుజువు చేయుటకు, నారాయణశాస్త్రి, పుల్లయ్యలను శిష్యులను కల్పించితిని. పుల్లయ్యను హాస్యరసమున కుపకరించునట్లుగ జేసితిని. అనవేముని ఏకసంథాగ్రాహిగా నొనర్చి, యతనికి భారవి కావ్యమును పాఠముగాఁ జెప్పించితిని. అనవేముని పట్టాభిషేక సమయాన, నరసన్న మనుమఁడగు సోమేశకవి రచించిన "యాదవరాఘవీయము" అను సంస్కృత ద్వ్యర్థి కావ్యమును, "సీతాకల్యాణ"మను ఆంధ్రద్వ్యర్థి కావ్యమును రాజున కంకితము చేయించితిని. "యాదవరాఘవీయ" మిప్పటికిని వ్రాఁతప్రతిగా, కాకినాడలోని ఆంధ్ర సారస్వత పరిషత్కార్యాలయమున నున్నది. కాని యది యనవేముని కర్పింపఁబడిన కృతికాదు. నారాయణకవి విరచిత కావ్యము కేవలకల్పితమే. రేచిగాని చరిత్ర జరిగినదే.

# ఈనాటకమున వచ్చు పాత్రలు

| | | |
|---|---|---|
| నరసన్నభట్టు | ... | కథానాయకుఁడు |
| కృష్ణసూరి | ... | నరసన్న పెద్దకొడుకు |
| సోమేశకవి | ... | కృష్ణసూరికొడుకు |
| వెంకన్న | ... | నరసన్నజ్ఞాతి, ప్రతికక్షి |
| రామన్న, దీక్షితులు, సోమన్న, సుబ్బయ్య, అన్నప్పసోమయాజి | ... | వెంకన్న మిత్రులు, వెలికిఁ దోడ్పడిన వారు. |
| వెంకప్పగారు | ... | సభాధ్యక్షుఁడు |
| సభ్యులు | ... | |
| సీతారామశర్మ | ... | బాలకవి |
| రేచిగాడు | ... | పాలికాపు |
| పుల్లిగాఁడు | ... | చాకలి |
| వేఁటసిబ్బంది, బ్రాహ్మణులు కొందఱు | | |
| నారాయణశాస్త్రి, పుల్లయ్య | ... | నరసన్న శిష్యులు |
| అనువోతుఁడు | ... | ఉప కథానాయకుఁడు |
| శీలవతి | ... | అనువోతునితల్లి |
| సీతాదేవి | ... | అనువోతుని భార్య |
| లచ్చమ్మ | ... | నరసన్నభట్టు భార్య |

# నరసన్న భట్టు

## నాంది

ఓంకారాక్షర దివ్యరూపుఁడు, కళావ్యూహాధినాథుండు, పు
ణ్యాంకూరప్రతతిప్రవృద్ధి రచనా ప్రాప్యర్థనుం, దుగ్రదై
త్యాంకారిందముఁ, డాశ్రితావన లసద్వ్యాపారదక్షుండు, శ్రీ
శాంకర్యాత్మజుఁడౌ గణేశుఁడు సదస్యశ్రేణిఁగాపాడుతన్.

శ్రీ లీలాప్రతిభా క్షమాప్రణయగర్వీభూత చేతస్కతా
శ్రీలా నీలల ముప్పురస్ వశలుగాఁజేపట్టి, వక్షోభుజాం
కాలంకారపద మ్మొసంగి శ్రితరక్షావాప్తి నూహించు గో
పాలుం డాశ్రిత కల్పభూరుహము సభ్యశ్రేణి రక్షించుతన్.

శేశే ! చర్విత చర్వణంబగు ధరిత్రీజన్మలై, సద్యశ
శ్రీ రాజ్యాధిపులై, నృసింహులయి, లక్ష్మీపుత్రులై, సత్కళా
సూరిప్రస్తుతులై, సుశీలవతులౌ శుద్ధాంగనల్ గొల్వ ధా
త్రీరంగస్థిత పాత్రలౌ జనుల, గౌరీ శంకరుం దోచుతన్ ;

సూత్ర : మారిషా !

మారి : ఏమి, బావా?

సూత్ర : ఏమోయి, నీ కెప్పుడును బనిలేదు, తీఱిక లే దన్నట్టులుందువు?

మారి : నాకా పనిలేదు? పనిలేని జీవులెందైన నుందురా? అకర్మలోఁ గర్మగలదను గీతావాక్యమును భావింపుము.

సూత్ర : బాగు! బాగు! పనిలేకపోవుట యొక్క పనియే యన్న మాట, నీవు చెప్పకయే నేను నీవలన మున్ను గ్రహించితిని. కాని, నీ గీతను బట్టి కర్మలోఁగూడ నకర్మయున్నదేమో బాగుగాఁ బరిశోధించితివా?

మారి : బావా! గీతలలోఁబాండిత్యము నీ కఖండముగఁ గుదిరినట్లున్నదే! గీతారహస్యములేవేని నాకెఱింగింపనెంచి నన్ను రావించితివా?

సూత్ర : కేవలము గీతారహస్యమే కాదు, సాహిత్యసమ్మిళిత సంగీతరహస్యమును నీకెఱింగించి, యొకరూపక మాడింపఁదలఁచితిని.

మారి : నే నాడుదానను గానే !

సూత్ర: అవసరమై, మనసుకుదురుచో, నాయుడువాడవేగాదు, పాపు వాడవు గూడ, నీ వగుదువను ధైర్యము నాకులేకపోలేదు.

మారి: నీ ఛలోక్తులకేమిగాని, బావా, ప్రకృతవిషయము నానతిం గింపుము.

సూత్ర: ఒక నాటకప్రదర్శనమునకై తగునేర్పాటులను గావించుచు శ్రాంతిగొంటచే, విశ్రాంతి నాసించి, నుఖోదినగు నీతోఁగాసేపు తడవు ఛలోక్తులాడితిని.

మారి: సరే; కాని, నాటకమంటివి, ఏనాటకము?

సూత్ర: నరసన్నభట్టు—అను రూపకము.

మారి: కల్పిత కథా రూపకమా?

సూత్ర: కాదు, కాదు. చారిత్రాత్మకము.

మారి: ఈ చరిత్రాంశ మెందున్నది?

సూత్ర: ఎందా? వినుము.

భారతీ పాదపూజా రత్నపీఠికా
　　రాజ సంకాశ సద్రాజకులము
చింతామణీ దివ్యసంతాన సురభి సం
　　తాన దానగుణ ప్రధానకులము.
పరమభాగవత సత్పురుషపుంగవజాత
　　పూత చిరంతన ఖ్యాతకులము,
గాంగేయ విజయ విక్రమకళా సముపేత
　　శూరాలవాల విశుద్ధ కులము
మల్లికా చంద్రహీరోపమాన కీర్తి
చంద్రికాసాంద్ర లలితావనీంద్ర కులము
ఆంధ్ర మాతృరచిత సుకృతైకఫలము
ప్రథిత రాట్పూరి రాజిత రావుకులము!

అట్టి రావుకులము వారిది, వారికిమంత్రులై పురోహితులై మహా పండిత కవిప్రకాండులను పేరుగడించిన వింజమూరి వారిదియు, చరిత్రలను, శ్రీ రావుగంగాధరరామరాయ ప్రభుని కార్యదర్శిగా శ్రీ వింజమూరి లక్ష్మణమూర్తిగారు. అంగముగ గణించిరి. నరసన్నభట్టు కాక

దానిలోనిది. మహాకవి పుంగవులగు శ్రీ దేవులపల్లి తమ్మన్న శాస్త్రి గారు రచించిన "రావువంశముక్తావళి" లోఁగూడఁ దద్గాథకలదు. వారు నరసన్నభట్టును వర్ణించుచు,

అలఘు తపోధనుండు, నిఖిలాగమ ధర్మనయానువర్తి, ని
ర్మల తరకీర్తి, సద్గుణసమగ్రుఁ డుదగ్రకుటుంబ వైభవా
కలితుఁడు, వింజమూరి కులకంధి సుధాంశుఁడు, సత్కృపా కరుం
డల నరసన్నభట్టను ధరామరశేఖరుఁ డొప్పు మెప్పుగాన్.

అని చెప్పినారు.

మారి: ఆ రావు కులము మొన్న మొన్న దాఁక పీఠికాపురమేలు మహారాజుల కులమా?

సూత్ర: ఒక్క పీఠికాపురమేలు వారి కులమే కాదు. బొబ్బిలి, వేంకటగిరి, మైలవరము, జటప్రోలు—సంస్థానముల నేలు పద్మనాయక వంశీయుల కులమును నగును.

మారి: ఆలాగైన, నరసన్నభట్టు కథ తత్సంస్థానాధీశ్వరుల చరిత్రలకు మూలాధారమైనదా?

సూత్ర: అవును, బాగుగా గ్రహించితివి. మండ దొరకుచో, మనుజునే మ్రింగు కొండచిలువ వంటి యఖండ బుద్ధిమంతుండవు. ఇంక నీకుఁ జెప్ప వలసినది లేదు.

మారి: సరే, చరిత్రాంశమేదియు నీ వింకఁ జెప్పవలసిన యవసరము లేదుగాని, యీనాటక కర్త యెవ్వరో కొంచెము నొడివెదవా?

సూత్ర: నీకు నాటక విషయము ప్రధానమా? తద్రచయిత ప్రసంగము ప్రధానమా?

మారి: రెండును ప్రధానములే. ఏలయన, ప్రసిద్ధకవి రచనము కానిచో, ప్రేక్షకులకు వృథాప్రయాసము గలిగించినవారమే యగుదుము. కావున, నాటకకర్తం గూర్చి యించుక మున్నె యెఱుంగుట ముఖ్యము.

సూత్ర: నిజమే. ప్రస్తుత కవి ప్రస్తుతకవియే. అంతమాత్రమే కాదు. ఆయన సుప్రసిద్ధ నటుఁడు కూడ. అతి లేతన నటుఁడు రచించిన రూపకములు మిగులఁ బ్రదర్శన యోగ్యములుగా నుండును గాదా?

మారి : అవును. ఆ నటకకవి పేరేమి?

సూత్ర : నరసింహారాయ కవి.

మారి : ఆ పేరుగల కవులు, ముఖ్యముగా నాటక కవులు, పెక్కండ్రు గలరుగదా, వారిలో నీతఁడెవ్వరు?

సూత్ర : కవియు, నటుఁడుననగు నరసింహారాయ నామధారులు పెక్కురు లేరనుకొందును. అయినను, మనకవింగూర్చి చెప్పెదను వినుము,

ఏకేశ్వరోపాసనైకాగ్రచిత్త ప్ర
వృత్త జీవాకవి ద్వితతి నొకఁడు.
యువక హృద్యీకృత వ్యవసాయ ఫలగుణో
త్కర రచనా దేశికతతి నొకఁడు,
వినుతానుబంధ కవిత్వసముద్యోగ
చాతురీ ధౌరేయ సమితి నొకఁడు,
ప్రకటాంధ్ర నాటకరంగాంబర స్థిత
నటక నక్షత్ర గణమున నొకఁడు
సర్వమానవ సౌభ్రాత్ర సద్గుణుండు
మృదుతర శిరీషసుమసమ హృదయయుతుఁడు,
వింజమూరి కులాంభోధి విమల విధుఁడు
వేంకట నృసింహారాయ కవి ప్రభుండు.

మారి : ఓహో! ఆంధ్ర విశ్వవిద్యాలయమువా రున్నత పట్ట భద్ర పరీక్షలకుఁ బఠనీయగ్రంథములుగా నియమించి గౌరవించిన "అనార్కలీ" యను దృశ్యకావ్యము, "నారోజ్" అను శ్రవ్యకావ్యమును రచించిన కవితల్లజుం డాతఁడు. నే నెఱుంగుదును.

సూత్ర : నీవేకాదు. సకలాంధ్రులలో నతని నెఱుఁగనివా రుండరని నా నమ్మకము. ఆతఁడు బహు గ్రంథ రచయిత. కవిం గూర్చి మఱియు ముచ్చటింప సమకట్టుదుమేని, ప్రకృతకార్యారంభమునకు విలంబ మగును.

మారి : అట్లయినచో, నేతద్రూపక ప్రథమరంగ ప్రదర్శనమునకు భూమికల నాయిత్తపఱుచుటకుఁ బోవుదుమా?

సూత్ర : ఆఁగు మాఁగుము. ప్రదర్శనప్రారంభమునకుఁ బూర్వము నాటక రసానుగుణముగ ఋతువర్ణనము సేయుట ప్రాచీనాచారము.

మారి : బావా! ఋతుప్రసక్తి మనకేల? ఆపని నటిదికాదా?

సూత్ర : అవును. అవసరమగుచో నాఁడు వాఁడవు, పాడువాఁడవును, నీవేయగుదు వంటిని గాదా? నటి యిందులేదుగావున, నీవే ఋతు వర్ణనముఁ గావించి నటియింపుము. ఆలసింపకుము.

మారి : పోనిమ్ము. నీవు మాయక్కతోఁబాటు నాభారము కూడ భరించు బావవు గావున, నీ కోర్కి దీర్తునులెమ్ము.

తళుకుఁజందురుమోము కలువఁగన్నుంగవ
మవ్వంపు వెన్నెల నవ్వుతోడ,
చిలుక గోర్వంక వెన్నెలపుల్గు పల్కుతోఁ
దెలినీటిసెలయేటి కులుకుతోడ.
తేజారు తెలితెల్లు పూఁజీరతో వెల్ల
మొయిలువలువ మేలిముసుఁగుతోడ
రాయంచనడలతో రాణించు మించుల
మించు రిక్కసరాల సంచుతోడ,
పంకవిరహిత జీవన భావగీతి
కలను గవులనఁదచ్ఛరత్కాల విజయ
లక్ష్మి నవనవ శోభా విలాసగతుల
నలర వర్ణింప నలవియే నలువకైన.

సూత్ర : బళే! ముద్దు మఱఁదీ! నీ పాటచేఁ బాటచే నటిలేని లోటు దీర్చితివి. కన్నుల కఱవు దీఱినది, చెవుల పండువైనది.

(తెరలో వేదఘోషవినఁబడును.]

సూత్ర : [శ్రుతి నభినయించి]

తనశిష్యాళికి వేదభాగముల సంతన్ జెప్పుచున్, బాదుకా
ధ్వనికిన్ వేత్రనినాద మొక్కలయయై తాటింపఁగా, నల్ల దే!
చనుదెంచున్ నరసన్నభట్టు నదికిన్, స్నానంబుఁగావించి, సూ
ర్యుని కర్ఘ్యంబు నొసంగఁబోలు. మనమిందుండంగ యోగ్యంబొకో!

కనుక, మారిషా! పోయి చూతము, రమ్ము -

(నిష్క్రమింతురు)

అనంతపంతుల రామలింగస్వామి

# నరసన్నభట్టు

## ప్రథమాంకము

## ప్రథమ రంగము

రంగము : ఒక యేటిగట్టు. తత్ పరిసరముల నొకతోఁట.

ప్రవేశము : నరసన్నభట్టు ఇరువురు శిష్యులకు వేదపాఠము చెప్పుచు.

నర : బిడ్డలార ! ఆ తూర్పువంక చూడుఁడు. సూర్యోదయ మెంత మనోహరముగ నున్నదో !

సీ॥ ప్రాగ్దిశాకాంత గర్భంబుఁ దాల్పఁగ మోము
కళగాంచెననఁ దూర్పు తెలివినొందు :
గర్భభారక్లాంతికలనఁ దద్భామిని
పలుపునూర్పులనఁ దెమ్మెరలువీఁచు :
నిరత నిశ్వాసజనిత బహుస్వేదబిం
దువులన మంచుబిందువులుదోఁచు :
ప్రసవవేదనచేతఁ బడఁతిమూల్గెడుననః
బక్షికూజితములు ప్రబలుచుండు :

గీ॥ పద్మనాయక కులపరిపాలకుండు
చక్రరక్షణ దక్షుండు సకలలోక
బాంధవుండింక నుదయించి భయదతమముఁ
బాసి జ్ఞానతేజమొసంగి, ప్రజలఁబ్రోచు.

శిష్యుఁడు 1 : విన్నావురా, తమ్ముఁడా! గురువుగారెంత చక్కఁగా అరుణోదయమును వర్ణించినారో !

శిష్యుఁడు 2 : అపరప్రాచేతసులు. వారినోటినుండి వెలువడిన మాట యెల్ల సరసకవిత్వమే.

శిష్యుఁడు 1 : తమ్ముడా ! ఆ చెట్టుక్రింద చూడు. ఎవతెయో పడి యున్నది !

శిష్యుఁడు 2 : అన్నా ! ఆమె గురువుగారి వర్ణనకు సరిపోయిన రూపముతోఁ గూడ నున్నదే !

సర : (శిష్యులతో ఆమెను సమీపించి) ఓరీ, కుఱ్ఱవాండ్రా ! పాప మీపిల్ల యెవర్తెయో సొమ్మసిల్లినట్టు తోఁచుచున్నది. ఏటినీ రొక పాత్రతో తొందరగా తెండు. (శిష్యులు నీరు తెచ్చుటకు పరుగెత్తుదురు. సరసన్న భట్టు) (స్త్రీని బాగుగా పరికించి) ఈమె యాకారము గాంచిన, కట్టిన యుడుపులు, పెట్టిన నగలును గనిన, గొప్పయింటి వనితలాగు కనఁబడుచున్నదే! ఏల యిట్లు పడియున్నదో కాదా ! (శిష్యులు నీరు తెత్తురు సరసన్న భట్టు ఆ నీటిని స్త్రీ నోటిలోనపోసి, ముఖమున కొన్ని నీళ్ళు చిలుకరించును. ఆమెకు తెలివివచ్చును) అమ్మా ! నీ వెవరవు తల్లీ? ఏల యిక్కడ నిట్లు పండి యున్నావు?

శీలవతి : (హీనస్వరముతో)అయ్యా ! నా-మ-అ-ది యేఁడీ?

సర : అమ్మా ! నీమఱఁది యెవరు? నీ చరిత్రయెట్టిది?

శీల : (కొంచము తేఱికొని) స్వామీ ! నేను రావురాణి కోడలను. పూనపాటి మాధవవర్మకు, మా అత్తవారితో విరోధము. అతఁడు చిరకాలామర్షము లోపలఁ బెట్టుకొని లెక్కకు మీరిన కమ్మగెడ్డి సేనలను తోడుచేసికొని హఠమున మా వారి నెదుర్కొని సర్వనాశ మొనర్చినాఁడు. తమకింక అపజయము తప్పదని తలఁచి నానాథుఁడు నన్నుఁదప్ప తక్కుంగల రాణివాసంపు స్త్రీలనందఱను అగ్నిప్రవేశ మొనరింప ఆజ్ఞయిచ్చియున్నాఁడు. నాచిన్నమఱఁది, వెన్నమనీఁడు నన్నే దేనిగ్రామముచేరువఁ జేర్పఁదలఁచి యిటడించి పోయియున్నాఁడు. తోడికాంతలందఱు 'జవార' వ్రతమాచరించి తమపతుల కన్న మున్న స్వర్గమున కేఁగిరి. నిర్భాగ్యనగు నేను మాత్రము బ్రదికియుండి యిట్లువచ్చితిని. (ఏడ్చుచు) ఎవరియింటనైన దాస్యము చేయుచు కొంతకాలము జీవింప వలతును, తండ్రీ !

సర : సింగమ భూపాలు దేవివా, తల్లీ ? నీ కెట్టిగతి గలిగినది !

నర : అమ్మా! ఇంక వగవకు. నాకు కూఁతులులేరు. నీవు నాకూఁతువేయని యెంచి నీఁకేలోపమును రానీయక కాపాడెద.

శీల : నాయనా! ధన్యురాలను. నన్ను మీ యిచ్చవచ్చిన సేవలో-

నర : బిడ్డా! నీవిఁక విశేషముగా వచింప నక్కఱలేదు. నా శిష్యులు తోడువత్తురు, మెల్లఁగా మనయింటికి వెళ్ళు. స్నానసంధ్యాద్యష్ఠానములు ముగించుకొని, కొలఁదిసేపటికే యిల్లు చేరుదును. ఓరి శిష్యులారా! మీరీమెను జాగ్రత్తగాఁ గొనిపోయి మా యింటియామెకప్పగించి, సర్వ సదుపాయములును గావింప నా యాజ్ఞయైనదని చెప్పుఁడు. పొండు.

శీల : (భట్టారకుని పాదములకు మ్రొక్కును)

నర : దీర్ఘాయురస్తు! ఇష్టకామ్యార్థసిద్ధిరస్తు! (భట్టు నడిగా ఏటిదరికిఁ బోవును, శీలవతి ఛాత్రులవెంటఁబోవును)

## ద్వితీయరంగము

రంగము : నరసన్నభట్టు నింట నొకగది.

ప్రవేశము : లచ్చమ్మ (నరసన్నభార్య,) శీలవతియు.

లచ్చ : అమ్మా! దైవ నిర్మాణము నెవరు తప్పింపఁగలరు? ఊరకుండుము.

శీల : ఊరకుండక యేమిచేయఁగలను? కాని అన్నియు తెలిసినను, పూర్వచరిత్ర కళ్ళకు కట్టినట్టులుండి దుఃఖము వచ్చుచుండును.

లచ్చ : అంతయు నిజమే, తల్లీ! కాని, పడినగోడలు పడినట్లే యుండవుగదా? ప్రకృతము నీకు రాజ్ఞీవైభవము లేక పోవచ్చును, గాని యింకేలోటును కలుగనీయమని నమ్ము. మాకాఁడు బిడ్డలులేరుగదా! నీవే మాయింటి యాఁడుఁబడుచు వౌదువు.

శీల : అమ్మా! మీరేలోపమును కలుగనీయరని యెఱుఁగుదును. ఎంతరాణివాసపు స్త్రీయైన, మీవలె అన్నమే తిందునుగాని, వెండి బంగారములు తిననుగదా? కాని,

సీ॥ ఆకాశవాహినీ యానమ్ము నొసరించు
రాయంచ నేలపై వ్రాలినట్లు
అత్యున్నత స్థితి నమరు నీహారాద్రి
పాతాళగహ్వరానఁ బడినయట్లు
క్షీణపుణ్యమ్మున స్వీయలోకము వీడి
తారకామణి నేల జాఱినట్లు,
ఆనందనౌకా విహారమ్ము సలుపుయాన
బుడుఁగున నుడుపమ్ము మునిఁగినట్లు

గీ॥ ప్రాజ్యరాజ్యాధి వైభవ పదవిఁబాసి
అతినికృష్ట నీచస్థితి నందియుంట,
తల్లి! దుఃఖప్రవాహమ్ము వెల్లివిరిసి
వరదలై యొక్కతటి నిట్లు పాఱుచుండు.

లచ్చి : అమ్మా! నీవన్నమాట నిజమే. ఒకప్పుడు అనుకొనని దుఃఖము వచ్చును. కాని, నీవొక రాచపడుచువన్న మాటే మఱచి, ఒకపేద బాపని యింటఁబుట్టి కాలవశమున మగనిఁగోల్పోయిన ఒక సామాన్య స్త్రీవని యెంచుకొనుము. నీకడుపునఁ బెరుఁగుచున్న బిడ్డకొఱకు నీ దుఃఖమును దిగమ్రింగక తప్పదు.

శీల : పిన్నిగారూ! అన్నియు ఎఱుఁగుదును. అయినను,

గీ॥ దుర్భర విపజ్జలధర సందోహములని
నా హృదయగగనమ్ము పూర్ణముగఁగప్ప,
మఱినిరాశా ప్రశీతల మారుతమ్ము
పైవిసీవ, బాష్పసలిలవర్ష మరుదె?

లచ్చి : అమ్మా! అటులే కావచ్చును. నీ హృదయాకాశమున ఎంతటి సాంద్ర మేఘాలలమికొన్నను, ఆ చీఁకటులు పాపుటకు అచిరకాలములోనే అందొక్కరిక్క యుదయింపనై యున్నది గదా! ఏల చింతింతువు?

శీల :

గీ॥ చండదుఃఖాతపాహతి నెండిపోయి
యొక యెడారిగా మార్పొందియున్న మద్ధృ
దయ వసుధ, తల్లి! నీదు సుధా ప్రపూర్ణ
భాషణాంబు సేచనమునఁ బదనుగాంచె.

అమ్మా! నిరంతరము నాతో నేయుచున్న యీ పనుల కడ్డంకిగానుండు నేమో! బాబయ్యగారు పొలమునుండి వచ్చువేళ యైనున్నది. వారికేమి కావలయునో చూడుము.

లచ్చ : అమ్మా! నీవు మా కెందును అడ్డంకిగాలేవు. మా పాలి కింటికి నిజముగా సామ్రాజ్యలక్ష్మివలె వచ్చితివిసుమా!

శీల : (వాపోవుచు) విష్ణువు నెడఁబాసిన లక్ష్మికేమి శోభ యుండును? (పావకోళ్ళ చప్పడు వినఁబడ) అదిగో! బాబయ్యగారు వచ్చుచున్నారు.

నర : (ప్రవేశించి) కుమారీ! సులువుగా తిరుగుచున్నావా?

శీల : బాబయ్యగారూ! మీ ఆశీస్సు వలన సులువుగానే ఉన్నాను.

నర : శాస్త్రవాదములు పెట్టుకొని రాత్రి భోజనము ఆలస్యముగా చేయుట నాకలవాటు; కాని నీ భోజనమునకు వేళ మించరాదు గనుక, పెందలకడనే వచ్చితిని.

శీల : తండ్రీ! కృతజ్ఞురాలను.

నర : బిడ్డా! నీ నామ నక్షత్రాదులను బట్టి జాతక చక్రము వ్రాసి చూచితిని. నీ కీపున్నమలోపల పురుడు వచ్చును. సర్వ శుభలక్షణ శోభితుఁడగు సుతుఁడు ఉదయించును.

శీల : పార్వతీ పరమేశ్వరులఁ బోలియున్న మీ దంపతులకు నమస్కరించుటకన్న నేఁ జేయునదిలేదు.

(నమస్కరించును)

నర, లచ్చ : శీఘ్రమేవ సుపుత్రా వాప్తిరస్తు! ఇష్టకామ్యార్థసిద్ధిరస్తు!

లచ్చ : అమ్మా! ఇంక లోపలి కేఁగుము.(శీలవతి పోవును)

నర : పాపమీయమ్మాయి దీనస్థితిఁ జూడ, గుండె నీరై పోవుచున్నది. ఈమె సుఖ ప్రసూతమైనదాఁక జాగ్రత్తగాఁ గాపాడవలయును. అబ్రాహ్మణస్త్రీ నొకర్తను నాయింటఁ బెట్టుకొని, కూఁతుగాఁ జూచుచున్నానని గ్రామస్థులు గుజగుజలు పోవుచుండిరి. కానిమ్ము, చూతును. వారినెల్ల నా ప్రతివాద మంత్రములకు కట్టువడిన

ప్రాయశ్చిత్తం గావించెద. ఈ దురాచార పరాయణులా నాలో తప్పులు పట్టఁగలవారు? ఈ మిథ్యాచారైన సంఘమును సంస్కరించెదను. లోపలికిఁ బోదము రా. (నిష్క్రమింతురు)

## తృతీయరంగము

రంగము : నరసన్న గృహము.

ప్రవేశము : నరసన్న, కృష్ణసూరి (నరసన్న కొడుకు) లచ్చమ్మ. శీలవతి—నరసన్నభట్టు భాగవతమునందలి గజేంద్రమోక్ష ఘట్టము చదువుచుండును. నడుమ నరసన్న, పుల్లయ్య, గోపాలకృష్ణుఁడు వచ్చును.

నర : ఏమిరా? ఆతురముగ వగర్చుచున్నావు?

పుల్ల : గురువుగారూ! కొంపమునిఁగినది. మాధవవర్మ పంపిన గూఢచారులు శీలవతీ దేవికోసము వెదకుచుండఁగా, ఆమె యిక్కడ నున్నదని యెవరో వార్త మోసివేసినారఁట.

నర : అయిన నేమి?

పుల్ల : వారు మనయిల్లు ముట్టడించి, శీలవతీదేవిని కొనిపోయి మిమ్ము శిక్షించెదరఁట.

నర : ఇదియెల్ల నీకెట్లు తెలిసినది?

పుల్ల : నేను మాధుకరమునకై తిరుగుచుండ, మాధవవర్మ భటులు రామాలయపుచావడిమీఁద కూర్చుండి మాటాడుకొనుచుండిరి. వారినుండి నేనంతయు విని యీ వంకకుఁ జావుపరుగున వచ్చితిని.

కృష్ణ : తమ్ముఁడా! గుండె ఆఁగక బ్రతికివచ్చినావుగద? సంతోషము!

శీల : బాబయ్యగారూ! నామూలమున మీకెట్టి కష్టములు కలుగుచున్నవి! ఇప్పు డీ హావడి తప్పించుకొను మార్గమేది?

నర : అమ్మా! భయపడకు, వారెట్టి చేటును కల్గింపఁజాలరనియే నా నమ్మకము, కృష్ణా! దీనికంతకు కారణము నాకుఁ దెలిసిపోయినది. మనబ్బావి, వెంకన్న యనే వృథామాత్సర్యము వహించి యీ కల్పించియుండును.

పుల్ల : గురువుగారూ ! ఆ దుష్టులు సామవాక్యాలకు లొంగరని నా భయము.

కృష్ణ : ఓరి పిటికీ ! ఇన్నాళ్ళనుండి మానాన్నగారి శుశ్రూష చేయుచుండియు వారిశక్తినే యెఱుఁగవటరా? ఆయన బార్హస్పత్య చాణక్య తంత్రాధ్యయన మొనరించిన మేటియని యెఱుఁగవా? ఏ యుపాయము చేతనో ఆ దుష్టులఁ దొలఁగింపఁగలరు. నీ వట్లు వణఁక నక్కఱలేదు.

పుల్ల : (బావురుమని యేడ్చుచు) గురువుగారూ ! నన్ను మా అమ్మ కప్పగింపుఁడు. మా అమ్మకు నే నొక్కఁడనే కొడుకను.

నర : (నవ్వుచు) ఆ శూరులు నీవంటి మహాపరాక్రమశాలిని చంపినఁగాని, తమజయము పూర్తిగాదని యెంతు రనుకొంటివా?

శీల : బాబయ్యగారూ ! ఆ హంతకులు మీకు లోఁబడిన, నేఁటే కాకున్న, మీరు కొంకక నన్నర్పింపుఁడు. అంతియే కాని నా మూలాన ఇడుమల పాలుకాకుఁడు.

లచ్చ : అదేమిటి తల్లీ ! నిన్ను శత్రువుల కప్పగింతుమా? మమ్ములను కడ తేర్చికాని, శత్రువులు నిన్ను తాఁకలేరు.

కృష్ణ : సోదరీ ! ఆ క్రూరులు నీ కొఱకుఁగా దిచ్చటికి వచ్చుట, నీ కడుపునఁ బెరుఁగు బిడ్డకోసము. “శత్రోశ్శేషమ్ న శేషయేత్” అను రాజనీతి మాధవవర్మదై యుండును. కాని, వెఱవకు. తండ్రిగారేదో తగిన యుపాయమును యోజించియే యుందురు.

(తలుపుమీఁద గ్రుద్దుల చప్పుడు వినఁబడును)

పుల్ల : (ఉలికిపడి) ఓయినాయనో ! వారువచ్చినారయ్యా ! ఆమిద్దెమీఁద దాఁగుకొనెద.

నర : ఓరిమూర్ఖుఁడా ! అల్లరిచేయకు. మేము జీవించియుండఁగా నీ కెట్టి భయము కలుగదు.

పుల్ల : మీరును జీవింపరనియే నా భయము.

నర : ఎంతధైర్యశాలివిరా ! నీ యిచ్చవచ్చినచోట, దాఁగుకో ! కృష్ణా ! తలుపు తెఱచి, వచ్చినవారు శత్రువులైనను జంకక, సగౌరవముగా లోనికి తీసికొనిరా.

(కృష్ణసూరి పోఁగును, పుల్లయ్య నాలుగుమూలలను పరుగులెత్తి, ఒకమూలనక్కియుండును. కృష్ణసూరి మాధవవర్మతో, అతని అనుచరులతో ప్రవేశించును)

కృష్ణ : దయచేయుఁడు. వారు మాతండ్రిగారు, నరసన్నభట్టారకులు.

మాధ : ఏమయ్యా, భట్టారకా ! నీవు మా శత్రువు భార్య కాశ్రయ మిచ్చితివఁట. నిజమా?

నర : తమ శత్రు వెవ్వఁడు? అతని భార్య యెవర్తె?

మాధ : ఏమీ, తెలియనట్లు మాటాడుచున్నావే !

నర : ఎవరి కెవరు శత్రువులో, యెవరు మిత్రులో తెలిసికొనుటకు మా కేమి యవసరము? మా కెల్లరు మిత్రులే.

మాధ : ఓహో ! మాకు మాటలతోఁ బనిలేదు. వినుము. రావువారు మా విరోధులు. వారికోడలు మీ యింట నున్నదఁట. అవునా, కాదా?

నర : రావువారి కోడలు మాయింట నెట్లుండును?

మాధ : (కోపముతో) ఆలోచించి మాటాడుము. వృథాగా కష్టాల పాలుగాకు.

నర : మహారాజా ! ఇంతకుముందు తమప్రతాపానలము బహువిరోధి నృపాలవంశకాననముల దహించి విశేష సుకృత మార్జించియే యుండును. దానికి తోడి బ్రాహ్మణ విధ్వంస పుణ్యము కూడ మూటఁగట్టుకొనఁ దలఁచినదా? కానిండు, మీ పరిశోధన.

(తన్నుఁజంపుదు రేమోయని పుల్లయ్య కెవ్వన కొక్క-కేక పెట్టును)

మాధ : ఓపిఱికిబాపఁడా ! నిన్నుఁటివారిని చంపుటకు మేము రాలేదు. మీయింట దాఁచిన కాంతకొఱకు వచ్చితిమి. అగ్రకులజుల మని విడ్చి పోఁగక, ఆమెను మా కప్పగింపుఁడు.

నర : మాకాభిజాత్యము లేదు. జాతిమత కులభేదములు మానవకల్పిత ములు. ఈశ్వరుఁడు లోకపితయైనపుడు మనమందఱము ఏకకుటుంబము వారము. ఏక కుటుంబము వారమును అగుదుము.

మాధ : మీకట్టి అభిప్రాయము లున్నవని తెలిసియే, బ్రాహ్మణేతర కులజయైన మా వైరికాంత మీయింట నున్నదన్న నమ్మితిమి.

నర : మా అభిప్రాయములు పలువురకుండ వచ్చును. వారి గృహము లను ఇట్లు పరిశీలించితిరా?

మాధ : ఇఁక మాకు మీతో వాదించుటకు కాలముచాలదు. అగ్ని, ఋణము, శత్రువు, శేషింప నీయరాదన్న రాజనీతి మీకును దెలిసి నదే ! మాధర్మ పరిపాలన కడ్డువచ్చిన వారిని ఎదురింపకమానము. ఇంక మాటలు కట్టిపెట్టి మీయింట నున్నవారి నందఱను మాకుఁ జూపి వారు నీకెట్టి చుట్టాలో విశదీకరింపుము.

నర : అయ్యా ! తప్పక చూపెదను. మాబ్రాహ్మణ చెలువలకు గోషాలో వలె 'ఘోషా' లేదుగద? అందఱు నిచ్చటనే యున్నారు. ఇతఁడు నా కుమారుఁడు, ఈతఁడు నా శిష్యుఁడు, ఆముసలిది నాయిల్లాలు, గర్భవతియగు ఆయింతి నా పుత్రిక. వీరే నా కుటుంబములోని వారలు.

మాధ : ఆయింతి మీ పుత్రికయగుట నిశ్చయమా?

కృష్ణ : మాతండ్రిగారు తమపుత్రికయని స్పష్టముగా చెప్పుచుండఁగా, మీకు సంశయమేల?

మాధ : ఆమె మీలో నెవ్వరిని పోలియుండక పోవుటచే అటులనుగు చున్నాము. ఆమె సౌకుమార్యము చూడ, రాణివాసపు వనిత యట్లు తోఁచుచున్నదే !

కృష్ణ : ఆమె మగఁడు మహైశ్వర్య సంపన్నుఁడు. కాని కాలక్రమ మున ఆ సంపదలెల్లఁ గోల్పోయి కాశికిఁ బోయినాఁడు. ఆమె నిచ్చట దిగవిడిచినాఁడు. బహుసంపదలందియుంటచే సుకుమారత్వ మొంది యున్నది. అంతే !

మాధ : మీయింట వంట యెవ రొనరింతురు?

నర : నా భార్యయే.

మాధ : నీ కూఁతురేల చేయరాదు?

నర : చేయ కేమి? గర్భభారము వలనఁ బ్రకృతమునఁ జేయఁజాలదు.

కృష్ణ : పుట్టినింటికి వచ్చిన ఆఁడుపడుచును సుఖపెట్టుదురుగాని, వంట లోఁబెట్టి కష్టపెట్టరుకదా?

మాధ : భూసురులారా! మీరెన్ని చెప్పినను, నమ్మఁజాలకున్నాను. ఈ చిన్నది బ్రాహ్మణి కాదనియు, మీకుఁ గూఁతులు లేరనియు, మాకొక విప్రుఁ డీయూరివాఁడే చెప్పినాఁడు.

నర : ఆ విప్రుఁడు మాజ్ఞాతి, మాయెడ మాత్సర్యము గలవాఁడు. మఱొకఁ డెవ్వఁడైన ఆమాట చెప్పిన, తాము నమ్మవచ్చు.

మాధ : ఓహో! మేము సామముచే ప్రసంగించుకొలఁది మీరు త్రాడువారు చుంటిరే! ఆమె మీ కూఁతురు కానిండు, కాకపోనిండు. మాకప్పగింప వలయును.

నర : మా కూఁతును మీ కప్పగించుట యేటిన్యాయము?

మాధ : మాకు తోఁచినదే న్యాయము. ఓరీ! ఈ బ్రాహ్మణులను బంధింపుఁడు.

పుల్లి : (ఏడ్చుచు) ఓయమ్మా! నాకును నీకును నేటితో ఋణముచెల్లినదే! (భట్టుచెయ్యి పట్టును)

నర : (విదలించుకొని కోపముతో)

శా॥ ఓరాజాధమ! విప్రశాపవచనాత్యుగ్ర ప్రతాపాగ్నిచే
నీరమ్మట్టుల నాశిపోయెదుసుమీ నీ పుత్రమిత్రాళితో;
పారమ్మందఁగఁబోలు నీదురిత భావస్ఫూర్తి: కాకున్ననీ
కీరాదే? బహుసాత్వికాళినిటు బాధింతే, మదాంధుండవై?

మాధ : (కొంచెము శాంతించి) భట్టారకా! ఏలయింత యాగ్రహము? ఓరీ భటులారా! దూరముగాఁ దొలఁగుఁడు,

నర : సత్త్వగుణప్రధానులమైన మమ్ము రేపిన మా గుణము మారిపోవును. మీ దౌర్జన్యమువీడి మీపాటికిఁ జనుఁడు.

మాధ : అటులే పోయెదము. కాని ఆమె మీ కూఁతురని మాకు పరిపూర్ణవిశ్వాసము గల్గింపుఁడు.

నర : అందులకేమి చేయుమని సెలవు?

మాధ : మీరామె చేతికూడు భుజింపవలెను.

నర : భుజింపకేమి?

కృష్ణ : కాని అది మీయెదుట నెట్లు?

మాధ : మేముకూడ ద్విజులమే కదా! దానికితోడు మీకుఁ గుల భేదాలు లేవనుచున్నారు గదా?

నర : తప్పక తిందును. ఈ రాత్రియే నా భోజనమువేళకు దయచేయుఁడు. ఎట్టి అడ్డంకియులేదు.

మాధ : సరియే. మఱలఁ గలసికొందము. (పరివారముతో వెళ్ళును)

పుల్ల : అమ్మయ్య! నా ప్రాణములిప్పుడు కుదుటఁబడినవి. వారు మరల రాకుండఁగనే, మాయింటి కుడాయింతును.

కృష్ణ : ఇంటికేఁగినను, వెంటఁదరుముదురేమో! జాగ్రత్త! పిచ్చి పుల్లయ్య!

శీల : బాబయ్యగారూ! కృతజ్ఞురాలను. (నమస్కరించును) ఋషిసత్త్ములరగు మీరు నాకొఱకు అనృతము పలుకఁ బూనితిరి గదా!

నర : అమ్మా! నా అనృతములు దోషరహితములు. అవి స్వార్థమభిలషింపక, ఒక యబలా ప్రాణరక్షణార్థ పలికినవి.

కృష్ణ : ఇదే శుక్రనీతి సారము.

పుల్ల : ప్రాణము మీఁదికి వచ్చినప్పుడు శుక్రనీతిలేదు, గురు నీతియు లేదు. కాఁపుఁదలకుఁ బనికివచ్చున దేదియో అదేనీతి.

నర : అమ్మాయి! శీలవతీ! సాయంకాల భోజనమునందు మా కన్ని పదార్థములును నీవే వడ్డింప వలయును. నీచేతి ప్రసాదము నాకు జగన్నాథ ప్రసాదమే.

కృష్ణ : ఇది ఆపద్ధర్మమైనను, పాటింపఁదగ్గదేయైనను, సాంఘిక మర్యాద నతిక్రమించిన వారమగుట బహిష్కరింపఁబడుదుమేమో!

శీల : అన్నా! నాకొంతయు నిందలపాల్గాకుండు.

సర : కుమారా! నిందవచ్చునని ధర్మము నెరపకుండుట మందగుణము. కానిమ్ము. మన దుష్టబంధువు సాంఘిక దండయాత్ర చేయించి, మనలను వెలివేయించిన, వారి నందఱను హేతువాదము లోనికి దింపి ఓడింప వలయును. కృష్ణా! నీవు పాండిత్యమున నాయంత వాఁడవుగదా! స్మృతి, శ్రుతి, పురాణేతిహాసములఁ దిరుగవేసి ధర్మనిర్ణయము సిద్ధపఱచియుండుము. తల్లీ! శీలవతీ! నీవిఁక లోనికిఁబోయి విశ్రాంతిఁగొనుము. నేను శిష్యులకు పాఠాలు చెప్పివత్తును.

## ద్వితీయాంకము

### ప్రథమ రంగము

రంగము : వీధి.

ప్రవేశము : వంకన్న, దీక్షితులు.

వంక : బావా! మా సరసన్న చేయుచున్న ఘోరకార్యము గురించి విన్నావా?

దీక్షి : విన్నాను, విన్నాను. అంతగొప్ప పండితుఁడు, కవియుఁగదా! వానికేమి పోఁగాలము వచ్చినది?

వంక : నిజముగా పోఁగాలమే వచ్చినది. శూద్రస్త్రీ చేతికూడు, అబ్రాహ్మణులు కొందఱు చూచుచుండఁగా, భుజించినాఁడఁట.

దీక్షి : అలాగున భుజించినంత మాత్రాన మాధవవర్మ నమ్మినాఁడా?

వంక : నమ్మక ఏమిచేయును! మీరెవ్వరును నోట ముద్దపెట్టుకొని మాటాడరైతిరి! మాధవవర్మ అడిగిన ప్రశ్నలకు జంకక గొంకక జవాబు చెప్పినవాఁడను నేనే. మీకందఱకు సరసన్న యన్న భయము, మొగమాటమును గలుగుటచేత సత్యముపలుకకుంటిరి.

దీక్షి : మనగ్రామమువారే కాదు, ఆంధ్రదేశములో నెల్లరు గర్వపడవలసిన మహాపండితుఁడు నరసన్నభట్టు. అతఁడు చేసినది తప్పుపనియేమైనను, ఎదుర్కొన సాహసింప లేకపోయితిని.

వెంక : పండితుఁడే తప్పుదారిని బోవునప్పుడు, మఱింత [illegible] వలసినది. మాధవవర్మ భట్టుమాటలు నమ్మినట్లు నటించినను, లోపల ననుమానము పొందక పోలేదు.

దీక్షి : అనుమానమున్నదని యెట్లు తెలిసి కొంటివి?

వెంక : భట్టారకు నిల్లు వీడి పోవునప్పుడు "ఓయీ బ్రాహ్మణుఁడా! ఇప్పటికి నీజోలికిరాక మేము పోవుచున్నాము. నీ కూఁతురు నీళ్ళాడిన తర్వాత మరల వత్తుము. ఆమెకుఁ బుట్టినబిడ్డ యెవరి పోలిక నుండునో చూడవలయు." నన్నాఁడు మాధవవర్మ. కనుక అతనికి సందేహమున్నదన్న మాటే.

దీక్షి : అలాగైనఁ నరసన్నకు, అతఁడు పోషించుచున్న సంసారమునకును ఇంకను ఆపదయున్నదనుకోవచ్చును.

వెంక : ఆ! ఉన్నది. వర్మ వానియిల్లువీడి ఈవలకు వచ్చుచుండఁగా "తడప మిన్నగుడైన దన్నట్లు, నాకుఁ గూఁతునకుఁ బుట్టుశిశువు చాల రేఁగి శత్రువును చెనక కుండునా?" అని మెల్లఁగా పల్కినాఁడు. వర్మ వినియు విననట్లు నటించి పోయినాఁడు.

దీక్షి : సరే! ఇప్పుడేమి చేయఁదలఁచితివి?

వెంక : ఊరి బ్రాహ్మణులనందఱను శివాలయములోనికిరావించి యొక సభ చేయుదము. బ్రాహ్మణధర్మమే నశించు నప్పుడు మనము మిన్నకుండ రాదని వారికి బోధించెదను.

దీక్షి : సభ చేసినంత మాత్రాన నరసన్న లొంగునా?

వెంక : అందఱమును గలసి వానిని వెలివేయుదము. అప్పుడు లొంగ కేమి చేయును? గ్రామస్థులందఱు వానిని చండాల సన్నిభునిఁగాఁ జూచునప్పుడు లొంగుటయే గాదు, పాదాక్రాంతుఁడగును.

దీక్షి : ఏమో! అదంతయు జరిగినప్పటి మాట.

వెంక : బావా! నీవు, రామన్న, సోమన్న, సోమయాజులు— అందరును నాపక్షమున నిలుతురేని, నరసన్నను, మూఁడు చెరువుల నీళ్ళు త్రాగింతును.

దీక్షి : నీకు, అతనికి, పూర్వమనస్పర్థలున్నవి గనుక, నీవు శ్రద్ధ వహించి బహిష్కరణ విషయములో యత్నింతువు. తక్కుంగల గ్రామస్థుల కేమి పట్టినది? వారెవ్వరును కూడిరారు.

వెంక : కూడిరారేమి? గ్రామస్థులకు వింజమూరి వారన్న, కోపమే. ఈనడుమ నతనిమూలముననే, కృష్ణయ్య "వాల్మీకి కులసంఘ" మను, నొకసంఘమును స్థాపించి, ఏర్పాటుచేసి, వారికి పాటలు నేర్పుచు ఊరూర తిరుగుచున్నాడట నీ వెఱిఁగినదే కదా?

దీక్షి : తెలియును. ఆ ముచ్చటలన్నియు విన్నాను, కన్నాను. ఈ యుద్యమమును బలిచేయవలెనని నా సలహా.

వెంక : మూఁడముగాక! నీవు మాత్రము నావైపున నిలువఁబడుదువుగాక! అదియే పదివేలు. ఈ సాయంకాలము దేవాలయములోను, రాత్రి యింటింటికిని, అందఱిని గలసి మాటాడుకొని మూఁడు నాల్గు దినాలలో సభ జరుగు నేర్పాటు గావింతము.

దీక్షి : నీవు పూనిన కార్యము విశేషభారము గలది. భద్రముసుమా! నలుగురిలో మనమాట నెగ్గవలయు. అంతియేకాని, అవమానము కలుగరాదు. పోదముపద. (నిష్క్రమింతురు)

## ద్వితీయ రంగము

రంగము : రచ్చబండమీద నుండు తోఁట. అందు చాఁపలు పఱచియుందురు. సభాపతి కూర్చుండుటకు ఒక గద్దె కంబళము, దానిముందర నొక వ్రాఁతబల్లయు అమర్తురు.

ప్రవేశము : సభ్యులు. వారిలో దీక్షితులు, వెంకన్నయు సభ నడుపువారు.

దీక్షి : (లేచినిలువఁబడి) సోదరులారా! నేఁటిసభకు బ్రహ్మశ్రీ వంక వెంకప్ప శాస్త్రిగారు అగ్రాసనాధిపతులుగా నుందురని కార్యదర్శినైన

తెలియఁజేసియే యున్నాఁడు. శాస్త్రిలవారినెఱుఁగనివా రీప్రాంతాన నుండరు. ఇప్పుడు బయలుదేఱు తరుణ వయస్కులగు పండితులలో పెక్కండ్రు వారి శిష్యులే. వారు వ్యాకరణశాస్త్రమందే గాక, శ్రౌతములో, జ్యోతిషములోఁ గూడ విశేష పాండిత్యము గలవారు. వారికి సనాతన హిందూ ధర్మమనిన మిక్కిలి యభిమానము. ఆ యభిమానమే వారి నీయధ్యక్షపదవికి రావించినది. అట్టి ప్రజ్ఞాధురంధరులు, నేఁటి మనసభ కధ్యక్షత వహించుట మన భాగ్యమనక తప్పదు. ఇంక కాలహరణము చేయక వారి నధ్యక్షత వహింపుఁడని మీయందఱ తరపున వేఁడుచున్నాను. (వెంకప్పగారు లేచి అగ్రపీఠ మలంకరింతురు. వెంకన్న పూలమాల వెంకప్పగారి మెడలో వైచును. సభ్యులు కరతాళధ్వనులు చేయుదురు.)

వెం: (లేచి) మహాశయులారా! నేఁడు మీరు నన్నీ యున్నత పదవికి రావించి కావించిన గౌరవమునకు కడుంగడు కృతజ్ఞుఁడను. కాని నాపై మీరు వైచిన కార్యభారము మాత్రము దుర్భరమైనది. నరసన్న భట్టారకుని బహుళశాస్త్రజ్ఞానము, నిరర్గళ వాక్పాటవము ఎల్లరెఱింగినవే. అతని కన్నింటఁదగిన ఔరసుఁడని చెప్పఁదగ్గవాఁ డతనికుమారుఁడు, కృష్ణసూరి. వారిపై మోపఁబడిన నిందలనుగూర్చి చర్చించుటయన,నాబోఁటివానికినిసాహసమనక తప్పదు. అయినను, ఇది మతాచార ధర్మ నిరసనమగుటచే జోక్యము కలుగఁజేసికొనవలసి వచ్చినది. మన బ్రాహ్మణ కులము వర్ణములలో అగ్రగణ్యము. "బ్రాహ్మణోస్య ముఖమాసిత్" అని వేదము చెప్పుచున్నది. శమము, దమము, తపస్సు, శుచిత్వము, ఆర్జవము, విజ్ఞానము, ఆస్తిక్యబుద్ధి- ఇవి బ్రాహ్మణున కుండవలసిన ముఖ్యగుణములు. వీనిలో నేది లోపించినను విప్రత్వము చెడినదన వచ్చును. పై గుణములు పాటించుటకే స్నానసంధ్యావందనాద్యనుష్ఠానములు, పంక్తిభోజననియమములు మున్నగునవి పెద్దలు నిర్ణయించిరి. మన నరసన్నభట్టారకుఁడు హిందూమత ధర్మములు, ముఖ్యముగా బ్రాహ్మణ ధర్మములు, తప్పిచరించు చున్నాఁడు. అది చింత్యము. తదౌచిత్యానౌచిత్యముల చర్చింతుముగాక. మొదట విం[illegible]మూరి

వెంకన్నగారుపన్యసింతురు. దయచేసి వినుఁడు. (కరతాళధ్వనులు, వెంకన్నగారు లేచుచుండఁగా యువకులలో కలకలము)

వెం: (కలఁతపడుచు లేచి, గొండినుండి పొడుముకాయఁదీసి. ఒకపట్టుపొడుము పీల్చుకొని) ఆర్యులారా! మిమ్ముఁ రావించిన పనిని గురించి అధ్యక్షులుఁడుగారు కొంత చెప్పిరి. నాకుపన్యాసము లిచ్చు అలవాటులేదు గనుక, నాకుబదులు దీక్షితులు బావగారు మాటాడుదురు. సద్దు చేయక వినఁగోరెద.

దీక్షి: ఆర్యవర్యులారా! సోదరులారా! వెంకన్న బావగారి కుటుంబమునకు నేను పురోహితుఁడనని మీ రెఱింగిన దే. వారు తామొనరించు పితృకర్మాదుల యందువలె నేఁటి సభా కార్యము నందును మంత్రతంత్రము లెల్ల నాకే విడిచిపెట్టి, తాము విశ్రాంతిఁ దీసికొనఁ నెంచిరి. వారిపని "మమ" అనుట మాత్రమే.

సభ్యుఁడు 1: అంతమాత్రమేకాదు, ప్రాచీనావీతి కూడ ఆచరింప వలయును. (హాస్యధ్వనులు)

దీక్షి: బావగారు తాము పచింపఁబోవు మాటలను వ్రాసి యిచ్చిరి. దానిని చదువుచున్నాను వినుఁడు. "నరసన్న గొప్పపండితుఁడని అందఱకుఁ దెలియును. కాని, అతఁడీనడుమ సల్పిన కృత్యమే మిగుల శోచనీయమైనది. పద్మనాయక కులస్థురాలు, రావువారి కోడలునగు నొకయిల్లాలి కాతఁ డాశ్రయమిచ్చుట గ్రామస్థులకందఱకుఁ దెలిసిన దే. అదియెంతయుఁ బ్రశంసనీయమే అయినను, అతఁడంతటితో నూరకుండక, ఆ వెలమచేడియ చేతికూడు కూడ తినుచున్నాఁడు. అతనిపొలముదున్ను పాలికాఁపు కేచిగాఁడను నొక మాలవాని పిల్లలకు చదువుచెప్పుచు, వాని మఱఁది కృష్ణయ్య పంచమ కులోద్ధరణము కావించుచున్నాఁడు. ఇవి బ్రాహ్మణాచారములకు విరుద్ధములయినవి. కనుక, పండితులు, బంధువులు, అని సంకోచింపక ఆ యిరువురను, వారి కుటుంబములను, మన బ్రాహ్మణ సంఘమునుండి బహిష్కరింప వలయును. శరీరావయవములలో నొకటి కుళ్ళిపాడగుచున్నప్పుడు దానిని ఖండించి శేషాంగ శ్రేణికి

రక్షణసేయుట పాడిగాదా! మీరే తెన్నుఁగా యోచించి నిర్ణయ మూహింపుఁడు. నా దగ్గరచుట్టమునే నే నిట్లు నిందింప వలసివచ్చెఁ గదాయని వగచు చున్నాను.

సభ్యుఁడు 2: నేఁటి సభాకార్యదర్శిగారు ఈ సూత్రప్రాయోపన్యాసము నయితము చెప్పఁజాలక, యితరులచే వ్రాయించుకొని వచ్చుటయే గాక, యింకొకనిచేఁ జదివించునంతటి చిన్నఁదనమునకుఁ గడంగుటకు మేము మఱియు వగచుచున్నాము.

అధ్య: ఎల్లరకు వారి వారి తెన్నుఁగానుండును. ఇంత మాత్రమున నాక్షేపింపఁజనునా? ఊరకుండుఁడు. రెండవ వక్త అన్నప్ప సోమయాజిగారు.

అన్నప్ప: నరసన్నభట్టారకుని నడత యెంతమాత్రము తగదు. అంతటిపండితుఁ డట్టినైచ్యమున కొడిఁగట్టుట శోచనీయ మనక తప్పదు. మత్స్య మాంసములుదిను శూద్రులతోఁ గలసి భుజించుట మన బ్రాహ్మణకులమునకు శోభితిగాఁ దగదు. వేయిమాలకాకులలో నొక కోయిలవలె కృష్ణయ్య ఆ మాలలతోఁ గూడి యాడుట మఱియు నసహ్యముగా నున్నది. వారు చిన్నవారేమో చీవాట్లు పెట్టుదమన్న, సర్వమెఱింగిన పండితులు, కవులును. అయినను వారు చేసినది తప్పేబని గనుక, వారిని బహిష్కరింప వలయును.

సభ్య 1: సోమయాజులుగారే బాగుగా మాటాడిరి. ఎవ్వరైనను కార్యదర్శిగారికంటె మేలే.

అధ్య: సోమయాజులుగారి తీర్మానమును సోమన్నగారు బలపఱిచెదరు.

సోమ: అవును, నే బలపఱుచు చున్నాను.

సభ్య: ఆహా! మహోపన్యాస మిచ్చితివయ్యా!

అధ్య: పిమ్మట బాలకవి సీతారామశర్మగారు కొన్ని పద్యాలు చదువుదురు.

దీక్షి: (ప్రక్కనున్న సభ్యునితో అపవారించి) వీని పద్యములు నేనే దిద్ది యిచ్చియుంటిని సుమీ.

రామ :

గీ॥ ఆర్యులార! హిందూమతధుర్యులార!
చిన్నవాఁడను నైన నా విన్నపంబు
శ్రద్ధతో వినఁగోరెద బుద్ధిమతులు:
తప్పులున్నచో క్షమియింపు డొప్పుగాను.

సభ్యు : ఈ బాలకవిగారు బొత్తిగా చదువఁబోని కసిగాఁడుగా నున్నారే! పద్యములో యతుల గతులఁ జూడ యతులితముగ నున్నవే!

దీక్షి : యతులెక్కడ లోపమయ్యా? చక్కఁగాఁ బ్రాసయతులు పడినవే!

సభ్యు : బాలకవిగారా, మీరా?

దీక్షి : ఆ పద్యములు నావికావే! నేనించుక దిద్దిపెట్టితిని. అంతే, అయినను, అతఁడు "తప్పులున్నచో క్షమియింపుఁ" డనుచున్నాఁడే!

సభ్యు 3 : "తప్పులున్నచో క్షమియింపుఁ డొప్పుగాను" అని చెప్పుకొనుమయ్యా, బాలకవీ!

అధ్య : ఆర్యులారా! ఇతఁడు బాలుఁడు. ఉత్సాహముతో నేవియో కొన్ని పద్యములు రచించి కొనివచ్చినాఁడు. వానిలో మంచిని గ్రహింపవలెఁగాని, తప్పు లేకరువుపెట్టవచ్చునా?

సభ్యు : మంచియున్న, అటులే గ్రహింతుములెండు. కానిమ్మయ్యా, బాలకవివర్యా!

రామ :

గీ॥ భట్టుగారినడత యేమి బాగులేదు:
శూద్రుకూఁడు తిన్నారఁట, భద్రమగునె?
బ్రాహ్మణోత్తములై యట్టి పాడుపనుల
చేయవచ్చునా? బొత్తిగా సిగ్గుగాదె?

సభ్యు 1 : ఓహో! ఏమిపద సౌష్టవము! ఏమిసమాసరచనా చాతుర్యము! మేలు, మేలు, బాలకవీ! బళీ! దిద్దిపెట్టిన దీక్షితకవీ!

రామ :

గీ॥ మాలవారికై పాటలు లీలఁజేసి
వారలను రాచకొని తిర్గుచూరివెంట
బయలు దేఱెడు కృష్ణయ్య భట్టుమఱఁది-
వెలినివేయఁదగినవాఁడె, యిలనుదలఁప.

సభ్య 3 : ఆహా ! దీక్షితులుగారు చెప్పినట్లుగానే, బాలకవికి ప్రాస యతు లప్రయత్నముగా నెంతచక్కఁగాఁ గుదురు చున్నవి ! “తిర్గు చూరివెంట”- ఎంత ముద్దయిన సంధికూర్పు !

రామ : (కోపముతో) అయ్యా ! నన్ను మాటి మాటికి ఆక్షేపించు చున్నారు. మీ రీమాత్రపుఁ గవిత్వము చెప్పఁడు, చూతునుగాక ! తప్పులు పట్టుట కారంభింతుమేని నన్నయ్యభట్టు కవిత్వములోఁ గూడఁ బట్టవచ్చును.

సభ్య 2 : అవునుబాబూ ! నీవంతటఁ సమర్థుఁడవే ! ఇప్పటికే భట్టు చరిత్రలోఁ దప్పులుపట్టు చున్నవాఁడవు, ఆ భట్టుకవిత్వములోఁ బట్టలేవా?

దీక్షి : అయ్యలారా ! మీరిట్లు బాలుని బెదరఁగొట్టుట, తగవు గాదు. అతనిశక్తి మీరు పరీక్షఁ జేయఁబూనుదురేని మీకుఁదోఁ చిన యంశమునుఁ గూర్చి యాశువున నొక పద్యముఁ జెప్పుమని కోరుఁడు. ఎంతచక్కఁగాఁ జెప్పఁగలఁడో మీకే విశదము కాఁగలదు.

అధ్య : సోదరులారా ! మీచర్యల నేనొప్పను. సభలో నొకఁడు మాటాడుచుండ నింకొకఁ డడ్డుపల్కరాదు. నాయనా ! తక్కిన పద్యములు చదువుము.

సభ్య 2 : (అపవారించి ప్రక్కవానితో) ఓయిబాబో ! అధ్యక్షుఁడుగారు శాసించు చున్నారురా ! ఇంకమన నోళ్ళకు తాళములు వైవవల యును గాఁబోలు. వాని పద్యములు ముగియనీ, క్షెంకప్పగారినే కందపద్యాలలో వర్ణింపుమందము. పస బయలుపడును.

సభ్య 1 : సరే.

నరసన్న భట్టు

రాము : చదువుమని సెలవా?

సభ్యులు : ఆఁ! సంతోషిస్తాము!

రాము :

శ్రుతులు, స్మృతులు, పురాణముల్ చోద్యముగను
శాస్త్రము, ఇతిహాసములును గలుగు మతము
వెక్కు వేలేండ్లనుండియుఁ బెఱుగు మతము
ఇలను మతరాజమనఁదగు హిందుమతము।

సభ్య 4 : భళీ! సీతారామశర్మ! హిందూమత ప్రాశస్త్య మిప్పుడు చక్కఁగా గ్రహించితిమి! "చోద్యముగను" అనుపదము ఎంత చోద్యముగా నున్నది!

రాము :

అట్టి మనమతము చెడెడునట్టివేళ
యూరకుండరే కిష్ణన సూరివారు?
అంత కల నరసన్న కృష్ణయ్యగార్ల
వంటవారే వెలివేయుఁడీ వేగమిపుడు

(కరతాళధ్వనులు)

సభ్య 3 : భేష్! బాలకవీ! మీ సంచపద్యరత్నమాల ప్రపంచమునఁ జిరస్థాయిగా నుండఁదగ్గదోయి! దానిచే నలంకృతుఁడవైన నీవు పంచశరునివలెఁ బ్రకాశించుచున్నావు. ఈ కడపటి పద్యములోని కడపటిపాద మెంత రసవంతముగాఁ బడినదోయి! సార్థకమైన పదాలతో నిండియున్నది.

అధ్య : అయ్యలారా! పాపమీ బాలుని నూరక కలఁత పెట్టితిరి కదా? అది న్యాయమా?

సభ్య 2 : అయ్యా! సంతోషము పట్టఁజాలక మేము పల్కిన మాటలను సైరింపుఁడు. బాలకవీ! అన్యథా తలఁపకుము.

సభ్య 3 : ఆశువున ఘనుఁడవని నీగురువుగారు పల్కుచున్నారు. ఏదీ, రెండు కందములలో మనయధ్యక్షుల వర్ణింపుము. చూతము, నీ తెలివితేటలు!

రామ : ఓ! అదేంతపని! వినుఁడు! ([illegible])

కప్పురపుటుండగుతో శ్రీ వెం
కప్ప సుపండితుఁడు హాయిగా వేపపునోర్
విప్పంగఁ గుప్పలు దుప్పలు
మెప్పులు సభికులు విడుచు సుమి యలబుభుపయుస్.

సభ్యు 2 : (పెద్దనవ్వుతో) హాయి, హాయి! [illegible]! సరళమైన నడక! మేలు! మేలు!

దీక్షి : ఊరక ఆక్షేపించుటగాదు. ఇట్టి కవిత చెప్పఁగలవారు నున్నవ్వారు? గొగ్గినడక యున్నదని కాఁబోలు మీ యనుమానము? యతులెంత భారాళముగాఁ బడినవి! "సభికులు విడుచు" అన్న ప్రయోగము—ఇది సంఘువాచకము. దీనిక్రియ ఏకవచనములో నుండవచ్చును. ఇట్టి ప్రయోగములు భారతములో [illegible] చూపఁగలను.

అధ్య : అయ్యా! ఇట్లు మీరు [illegible] ను నాయనుమతిలేని దే మాటాడఁ గూడదు. ఇంక నేనొప్పను. కూర్చుండుఁడు. (సభ్యులు మిన్నకుందురు) మఱియెవ్వరైనఁ బ్రసంగింపఁ దలఁచిరా? (ఎవరును మాఱుపల్కరు) పోనిండు. ఎందఱు భట్టారకుని పక్షమునందురో, యెందఱు వ్యతిరేకులై యుందురో నిర్ణయింపుఁడు. అంతే తీర్మానము ధ్రువపఱుతము.

సభు 3 : అయ్యా! తీర్మానము ధ్రువపఱుచుట కడిసన్యాముగా జరిగినప్పుడుగదా! దాని నామోదించువారు లేకయే బలపరిచిరి. అది యట్లుండ, మనము వ్యతిరేక పక్షమువారి వాదము కూడ వినవలదా? ఇప్పుడు చెప్పినవారిమాటలలో సహేతుకమై, యుక్తియుక్తమై, శాస్త్రసమ్మతమై, యనుభవసిద్ధమగు వాదమెద్దియు వినఁబడి యుండలేదు. కనుక, సభ మఱొకనాటికిఁ బెంచి, యానాఁడు భట్టారకునిఁగూడ రావించి యతనివాదముకూడ వినుటయుక్తము.

వెంక : అందఱును సభకు రాఁగా, సరసన్న యేల రాఁగూడదు? అతఁడెప్పుడును రాఁడు.

(తెరలోంచి "రాజేశ్వరీ! ఇదే నవరసాగ్రముగా వచ్చుచున్నాఁడు. నీ హృదయ కవాటములఁ దోఁచుచున్నాఁడు. నీకన్నఁగంద్రనముల బ్రచ్చుచున్నాఁడు. నీ సంకల్పదశలఁ ద్రవ్వుచున్నాఁడు")
(ప్రవేశము కృష్ణస్వామి, శిష్యులతో)

ఔరా! బ్రాహ్మణబంధువులార! పూత
జాహ్నవీతోయ సదృశ స్వచ్ఛహృదయుండు
దేవగురుసమాన నయకళావిదుండు
మజ్జనకుఁడొప్పఁడే యార్యమత విపక్ష?

అగ్నిపర్వతాంతర్గతంబౌ పదార్థ
ముట్టు లాత్మమాతృసర్వమ్ము నణఁచిపెట్టి
మా నిమిష బాంధవుఁడె నేఁ డీసదనిని
వెడలఁగ్రక్క, దవ్వుగఁబోవఁ గడఁగరేల?

నతిము వేశ్యలయిండ్ల సలిపెడు కామతం
త్రమ్ములే వేద సూత్రములుగాఁగ
నింత మన్యధనాపహరణ కృత్యంబులే
ఆత్మప్రధాన కృత్యములుగాఁగ
అసిత మసత్యసాక్ష్య ప్రయోగంబులే
కర్తవ్యకృతి నియోగములుగాఁగ
ఘనయమ్ము స్వీయలాభార్థచింతనములే
తమినొనరుచు మంతనములుగాఁగ

బ్రతుకు నామమాత్ర ద్విజవర్గమెల్లఁ
పంక్తిభోజనార్హమగునే? పేరివలన
మీ పవిత్ర హిందూమత మేపగిఁదిని
నిలిచియున్నదో తెల్పుఁడో కలుషమతులు!

ఘనమైశ్వర్యములంది, దీనజన సాహాయ్యమ్ముఁగావించి పే
రిమి గన్పట్టి సుశీల, కాలగతిచే శ్రీలెల్లఁ గోల్పోయి స్వీ
యామహానందనికేతనుం బతిని, ప్రేమాధారమౌ బంధువ
ర్గమును న్ గోల్పడి, యాశ్రయం బడుగఁ జేర్పం బాపకార్యంబొకో?

కసునార్తిం జనుఁదెంచు నట్టియబలన్ గాపాడఁగర్తవ్యమో,
విధవం దగ్గ పురాణమూఢమత సంవిద్భావమే ముఖ్యమో,

యెడఁదల్ విచ్చి పరీక్షఁజేసికొన మీకే గోచరంబయ్యెడిన్,
చెడుదారింబడి పోకుఁడీ, గురుల నిందింపన్ మహాఘంబగున్.

(ప్రవేశము నరసన్నభట్టు సంభ్రమముతో)

నర : కుమారా ! నీవేల తొందరపడివచ్చితివి? ఎందులకీ సంతోషము?

కృష్ణ : నాన్నగారు ! కూళలు కొందఱిచ్చటఁగూడి వృథాగా మిమ్ము నిందించుచున్నారని విని వారి నోళులు గట్ట వచ్చితిని.

నర : నాయనా ! వారివలెనే నీవును నిందకు దొరఁకొన్న, నీకొన్న భేద మున్నది? అధ్యక్షా ! నా కుమారుఁడు పూర్వాలోచనము లేక తొందరపడి పల్కుచున్నాఁడు. వానిని క్షమించి మీ కార్యముఁ జరుపుకొనుఁడు.

అధ్య : ఈసభ మిమ్ము, మీ మఱఁది కృష్ణయ్య గారిని, బహిష్కరించుటకై, కావింపఁబడుచున్నది. ఇం దందఱు మీ ప్రతినిధుల వలెనే కనఁబడుచున్నారు. మీ వాదము కూడ వినవలెనని యిప్పుడే యనుచున్నాము. అంతలో మీ కొమరుఁడువచ్చి అసంబద్ధములు చెప్పినాఁడు. అవియెంతయో రసవంతములుగా నున్నవి. తగినవేళకే మీరును దయచేసితిరి. మీ ప్రతివాదముకూడ వినఁ గోరుచున్నాను.

నర : మహాశయా ! ఇది మాజ్ఞాతి సంవాదముగాని, మత వివాదము కాదు. “షడ్డక షడ్డకశ్చైవ, ముష్టియుద్ధం పునఃపునః” అను వాక్యము మీరును వినియే యుందురు. మఱి వెంకన్నకు నాపై చిరకాలామర్షము గలదు. అదియే యీ సభకుఁ గారణము. మతములేదు, గితములేదు.

వెంక : ఇది కేవల మసత్యము.

సభ్యులు : కూర్చుండు, కూర్చుండుము (అని కేకలు, కలకలము)

నర : అసత్యముకాదు, ముమ్మాటికి సత్యము. మా యాంతరంగిక విరోధకారణము లిచ్చట వెలువరుప నిష్టపడను. మా స్వతంత్ర భావములు, మా యుచ్చస్థితిగతులే మా బందుగునకు మత్సర కారణములు.

ఇంక నాశూద్రాన్న భుక్తి విషయము — శీలవతి రావుసింగమ భూపాలు దేవి. ఆమె సమస్త బంధువులను గోల్పోయి, అగతికయై యుండియు, గర్భవతియై యుండు, సంతానకాంక్షచే జీవింపఁదలఁచి యున్నది. ఈశ్వర సంకల్పముచే ఆమె నాకన్నులఁ బడినది. నేనామెను నాకూఁతుఁగాఁ బెంప నిశ్చయించి యింటికిఁ గొనివచ్చినాను నమ్మకట శత్రువులకీ వార్త యెవఁడో పాపాత్ముఁడు తెలియఁజేసినాఁడు. (పథిలో కలకలను) వారు మాయింటికి వచ్చి శోధనలు చేసిరి. ఆమె నాకూఁతురని విరోధి నమ్మలేదు. అతనికి నమ్మకము గల్గించుటకు ఆమెచేతి కూడు తినవలసియున్నాఁడు. ఒక్క యబలా ప్రాణరక్షణము గావింపనా, బ్రాహ్మణాచారమే పట్టుకొని ప్రాకులాడనా— అని యిటుమక యోచించినాను.

"బ్రహ్మానా ఇదమగ్ర ఆసీదేకమేవ" అను నుపనిషద్వాక్యము జ్ఞప్తికి వచ్చినది. ఈ జగమంతయు మొదట బ్రాహ్మణ జాతిగానే యుండెఁగదా. ఆవల వృత్తులంబట్టి యేర్పడిన వర్ణభేదమునుజ్ఞానులు పాటింపరాదుగదా—అని యూహించితిని. మన హిందువుల సాంఘికాచారము లన్నిఁటిని, నూతన ప్రపంచము మీఁద నాధారపడి యున్న కొన్ని మతసూత్రములతో జతపఱచి వానిని సృష్ట్యాది నుండియు భగవంతుఁడే నిర్మించెననియు, అవి యవిలంఘనీయములనియు నమ్ముచున్నారు. సనాతన హిందూధర్మ పోషకులమని నిష్ఠీవిఁగు వారెల్లను ఈ విశ్వాసమునకు ప్రోత్సాహ మొసఁగుచున్నారు. అది మనసంఘాభివృద్ధి కెంతయు భంగకరము. విప్లవము వచ్చినప్పుడెల్ల మన సాంఘికాచారములు యుగయుగముల మారుచున్నవి. కనుక ప్రాత పద్ధతులను అవసరము వెంబడిని త్యజింపవచ్చునని స్ఫురించినది గుణముచే వర్ణనిర్ణయము చేయవలెఁగాని జాతిచేఁగాదు. బ్రాహ్మణుని కుమారుఁడు బ్రాహ్మణుఁడై యుండనక్కరలేదు, ఒకన్యాయాధికారికొడుకు న్యాయాధికారిగానే యుండక పోవచ్చునట్లు. ధర్మాచరణముచేత నికృష్టవర్ణములు ఉత్తమవర్ణములుగను, అధర్మాచరణముచే ఉత్తమవర్ణములు నీచవర్ణములుగను మార్పొందుచుండు. ఆపస్తంభసూత్రములందివి

మూఢుఁడు. ఈ విషయము లన్నియుఁ దెలియఁగలను. గీతారహస్యము, ఉపనిషత్సారమును లెస్సఁగా భావించినవాఁడ, సర్వజనీన సౌభ్రాత్రమే గోచరించుచున్నది. ధర్మశాస్త్రములను బట్టి నడచుకొందమన్న, అవి పరస్పర విరుద్ధములు. మన మెన్నో కృత్యములు శాస్త్రములకు వ్యతిరేకముగా ఆచరించుచున్నాము. ఆచరించక తప్పదు. ఆపద్ధర్మములని పేరుపెట్టి యెప్పటికప్పుడు మార్పులను చేయుచున్నాము. ఇప్పుడా పనియే చేయవలసి వచ్చినది. శీలవతి చేతికూడు తినుట తప్పుగాదని తోఁచినది. దురాచార సద్బ్రాహ్మణుని చేతియన్నము దురన్నమనియు, సదాచార సచ్ఛూద్రుని చేతికూడు సదన్నమనియు, నా మతము. శీలవతి సదాచార సంపన్నురాలు. ఆమె వడ్డించిన యన్నము ఆప్యాయముగా భుజింపఁదగ్గది. ఈశ్వర పితృత్వము, మానవ సౌభ్రాత్రము పాటించువారందరు నాతో నేకీభవింతురని నా నమ్మకము. ఇఁక విశేషముగా వచింపను. ఇంటియొద్ద నాకూఁతు రీనుటకు సిద్ధముగానున్నది. శీఘ్రముగాఁ బోయెదము, సెలవు దయచేయుఁడు. మీ రిచ్చవచ్చిన తీర్మానములు చేసికొనుఁడు. అవి మమ్మేమియు బాధింపవు.

(ప్రవేశము పుల్లయ్య)

పుల్ల : గురువుగారూ! శీలవతీదేవికి మగపిల్లవాఁడు పుట్టినాఁడు. అమ్మగారు మిమ్ము వేగముగాఁ గొనిరమ్మని పిల్వ ననుఁబంపిరి. దయచేయుఁడీ!

నర : సభ్యులారా!

ఇదినా కంచిత యోగకాలమగు దౌహిత్రుండు జన్మించుటన్;
మదినూహింప నవగ్రహా లుచితధామాలం బ్రవేశించి, య
భ్యుదయప్రాప్తిని దెల్పి, జాతకునకున్ బూర్ణాయురైశ్వర్య సం
పద సూచించెడు; పద్మనాయకకులప్రఖ్యాతి వర్ధిల్లెడున్!

కడుశుభలగ్న మియ్యది, యఖండ ధనంబు హఠంబునన్ లభిం
చెడు ఘనసూచనల్ హృదయదృష్టికి గోచరమయ్యెడున్, మహా
త్ముఁడు యుగపూరుషుండనుం బ్రఖ్యాతయశంబును గాంచి. మన్నఁడీ
పుడమిని బాలనంబు సలుపున్, మది నమ్ముఁడు నాదు భావ్యమున్!

పిల్లవానికి అర్హవిధిని జాతకర్మసంస్కారములఁ గావింపవలెను. మీ యందఱి కాహ్వానములఁ బంపెద, మాయింటికి దయచేసి శిశువును ఆశీర్వదింపఁ గోరుచున్నాను. నాయనా! రండుపోదము.

(నిష్క్రమింతురు)

(సభ్యులెల్లరు కిలకిలనవ్వులతో సభవిడిచిపోవుదురు)

అధ్య : వెంకన్నగారూ! నేను సభ ముగింపనిదే యెల్లరు వెళ్ళి పోవుచున్నారు. ఇంక మన తీర్పులు వట్టి యార్పులే. నరసన్నభట్టు వాదము సహేతుకమై హృదయంగమమై యున్నప్పుడు, మీ వాదమును వినువారెవ్వరు? మీరు, పాపము, వృథాశ్రమ పడినారు. మీరింటి కేగవచ్చును. బలవంతముతో మీకీపోరాట తగదు. పోవుదము రండు.

వెంక : కలికాలము! కలికాలము!

(నిష్క్రమింతురు)

## తృతీయాంకము

### ప్రథమ రంగము

స్థలము : నరసన్నభట్టు నివాసస్థానము.

(ప్రవేశము : నారాయణశాస్త్రి, పుల్లయ్య)

నారా : పుల్లయ్యా! రేపేసుమా నా ప్రయాణము!

పుల్ల : ఆలాగునా? నారాయణా! నీ వదృష్టవంతుఁడవురా, చక్కఁగా విద్యముగించి, స్వతంత్ర జీవన మొనరించుటకుఁ బోవుచున్నావు.

నారా : ఏ మదృష్టమురా? తొమ్మిదేండ్లయు వచ్చితిని. ఇన్నాళ్ళకు మూఁడుశాస్త్రములు మాత్రము ముగిసినవి. అంతేగదా?

పుల్ల : నేను నీకన్న నాలుగేండ్లు ముందుగ వచ్చితిని. శీలవతీదేవి ఇచ్చుటకి రాకమునుపే నేను బ్రవేశించితిని. ఇంకను గావ్యపంచకమైనను ముగింపఁజాలకుంటిని.

నారా : నీకొక వ్యాపృత్తియా? అన్నిపనులు నీకే కావలయుఁగదా? ఇంటిపేఁడు చాకిరియు నీవొక్కఁడవే యేల చేయుదువురా? ముందటి

మందబుద్ధివిగదా, దానికిఁదోడు ఛీచాకిరీ యేమిరా? ఒక్కనాఁడైని పట్టుమని యొకగంటసేపు చదివిన పాపాన పోలేదుగదా?

పుల్ల : ఏమి చేయుమందువురా? గురువుగారిచేఁ గాక యూరివాండ్రకును నాకే పనులు నియోగింతురు. ఇంకఁ జదువెట్లు సాగును? నాకుఁ దోడుగా గురువుగారి రెండవకొడుకున్నాఁడు. వాఁడుమతిలేనికడు గొప్ప రాజు–పనికిఁబోఁతురాజు! వాఁ డేపనియుఁ జేయఁడయ్యె.

నారా : ఆకారణముననే సుబుద్ధియను ఒక కాంచి మొద్దులఁగా గురువు గారు ఉపయోగించుకొనఁదలఁచుచున్నారు.

పుల్ల : నాకంటెఁ మొదటఁ బుట్టిన శీలవతీదేవికొడు కెంతచురుకుగా విద్య నేర్చుచున్నాఁడురా? ఒక్క శ్లోకము కంఠస్థము చేయుటకు నాకు నాల్గు దినాలు పట్టును. అనుమోతయ్య పది పండ్రెండు శ్లోకాలు దినదినము గురువుగారికి కప్పగించును.

నారా : అనుమోతయ్యది ఉద్దండపుఁ దెలివిరా? అతనికిఁ గావ్యపాఠము లెంతవఱకైనవి? నీకెంతవఱకైనవి?

పుల్ల : చెప్పుకొన్న సిగ్గు. నాకన్న నేఁడు వెనుకనుండియుఁ గొన్ని దినాలక్రింద నన్నుఁ గలసికొన్నాఁడు. మేమిప్పుడు భారవి చదువు చున్నాము. నేనింకను మొదటి సర్గలోనే యున్నాను. అతఁడు రెండు సర్గలు ముగించినాఁడు. శీలవతీదేవి మంచి యదృష్టవంతు రాలు సుమీ!

(ప్రవేశము శీలవతి)

శీల : నాయనలారా! మా యబ్బాయి యున్నాఁడా?

నారా : గురువుగారితోఁగూడి పొలమునకుఁ బోయి యున్నాఁడు. ఒక్కజాముప్రొద్దెక్కువఱకు వచ్చుటనే యుండుమని చెప్పి పోయిరి.

శీల : ఓహో, అదా? తెలిసినది. నేఁడొక నూతన విద్యోపదేశము బిడ్డకుఁ జేసెదమని బాబయ్యగారు సెలవిచ్చిరి. ఈ యాలస్య

ముందునకే కావచ్చును. చూడు నాయనా! మాపిల్లవాఁడు రాఁగానే ముందుగా అవ్వగారి కడకుఁ బోవలసినదని వానితోఁ జెప్పుము.

నా॰రా: అమ్మా! అంత ముందుగాఁ బోవలసిన పనియేది వచ్చినదో!

శీల: బాబూ! నేఁడు వాని పదుమూఁడవ జన్మదినము. అవ్వగారు వాని కారతులిచ్చి, తలయంటి, క్రొత్త యుడుపులు గట్టఁబెట్టుదురఁట. దానికొఱకే యామె పేరఁటాండ్రతో నెదురు చూచుచున్నారు.

నా॰రా: ఆలాగైన మన అనుహోతయ్యకు బాల్యావస్థదప్పి కౌమారము ప్రారంభమగుచున్నదన్నమాట. నేఁడేదోయొక నూతనవిద్యబోధించుటకే గావలయును, గురువుగారింత తడసిరి!

శీల: అవును, బాబూ! వాని కస్త్రవిద్య నేర్పెదరఁట.

పుల్ల: ఓయినాయనో! అస్త్రవిద్యయే! అది నేర్చి మాయందఱిమీఁద బాణములు ప్రయోగించును గాఁబోలు!

నా॰రా: పడిచినట్టులే యున్నది నీ తెలివి! నిన్నుఁ గొట్టియేమి, వీధిలోని కుక్కలను గొట్టియేమి? గురువులసంకల్పము మహత్తరమై యుండును అమ్మా! మీ నుడులు వినుట కెంతయు సంతసముగ నున్నది. విశ్వామిత్రుఁడు శ్రీరామచంద్రునకు శస్త్రాస్త్ర ప్రయోగ పద్ధతి బోధించినాఁడు. రాముఁడావిద్యచేఁ గ్రూరరాక్షసుల మర్దించి లోకోపకార మొనరించినాఁడు. అటులే అనుహోతయ్య కూడఁ గావించు ననుట కేసందియము లేదు.

శీల: మీ యాశీస్సులవలన అటులే యగుఁగాక! (నిష్క్రమింతురు)

పుల్ల: ఈయమ్మదెంత సాత్త్విక స్వభావమురా! పల్లెత్తి యొక్క మాటాడఁగా నీమెను నేఁజూడలేదు.

నా॰రా: బ్రతికిచెడ్డ పడఁతి. ఆమెకట్టి గుణాలుండుట యబ్రమా;

పుల్ల: ఆమెమాటకేమిగాని, నారాయణా! విద్యముగించి యింటికేఁగిన తర్వాత మనము ప్రాయశ్చిత్తకర్మముఁ జేయించుకొనవలెను గాఁబోలు.

నారా: ఎవనికిరా, ప్రాయశ్చిత్తము? కావలసియున్న, నీవు చేయించుకో, నాకక్కఱలేదు.

పుల్ల: అట్లాగైన, గురువుగారి చర్య తప్పు గాదందువా?

నారా: కాదనియే నా దృఢవిశ్వాసము. నా విశ్వాసమును మార్చుకొనను. దానిని నిలువఁబెట్టుటకై వలయునో, నా పెద్దలనుగూడ ధిక్కరింతును.

పుల్ల: నాకట్టిది సాగదురా, గురువుగారి సంఘసంస్కరణోద్దేశములు సమస్తాంధ్ర దేశమునందును వ్యాపించి యున్నవి. మా నాన్నకును దెలిసినవి. మొన్న మకరసంక్రాంతికి నేనింటికి వెళ్లినప్పుడు పంచగవ్యములనిప్పించిన పిమ్మటఁగాని, నన్ను లోపలికి రానీయలేదు. ఈ కారణాన ఇంటికిఁ బోకుండుటయే మేలని తోఁచుచున్నది.

నారా: పోకు. మాధుకరభిక్ష లభించినన్నాళ్ళు ఇచ్చట నీయుండుము ఇంటికిఁబోయి మాత్ర మేమి చేయుదువు?

పుల్ల: ఏమి చేయుదునా? పెండ్లాడుదును. సుఖముగాఁ గాఁపురము చేయుదును. ఈ బ్రహ్మచర్యాశ్రమములోనే గొల్లకాలము నుండుదురా, గురువుగారు?

(ప్రవేశము నగసన్నభట్టు అనువోతునితో)

నర: శాశ్వత బ్రహ్మచర్యమే బ్రహ్మ నీనొసట వ్రాసినట్లున్నాఁడు.

పుల్ల: అయ్యా! తమరే అట్లులన్న, నాముందుగతియేమి?

నర: నీగతిని నిర్ణయించుకొనుట నీలోనున్నది. విద్యయే మిము అంటకుండెను. చూడు మీ చిన్నిపాపని, నీకండ్ల యెదుటఁ బుట్టిన మన యనువోతుని! కావ్యపాఠాలలో నిన్ను మించిపోయినాఁడని గుర్తించినావా? నీతో సమానముగా విద్యారంభము గావించిన మా మనమఁడు సోమేశము చదువు ముగించి, ద్వారకి కావ్యరచనకే పూనినాఁడుగదా?

పుల్లి: ఎంత చదివిన నంతమంచిదని, సదా చదువుచుందును. నేను గట్టిగాఁదలపెట్టుదునేని, ద్వ్యర్థికావ్యమేకాదు, త్ర్యర్థి కావ్యము కూడ రచింపనా?

నర: (నవ్వుచు) అంతటివి సమర్థుఁడవే! ఎల్లకాల మిట్లు చదువుకొనుచుందుము. కాని నీకుఁ బరిణయ మక్కఱలే దంటివి.

పుల్లి: పోనిండు. ఆంజనేయునివలె బ్రహ్మచర్యదీక్షలోనే యుండిపోయి కీర్తి గడింతును లెండు.

నర: చేష్టలచేఁ గోఁతివంటి వాఁడవే! తోఁకయొక్కటే నీకుఁ దక్కువ. సరే! నారాయణా! నీ ప్రయాణమున కన్నియు సిద్ధము చేసికొనుము. ఇంటికేఁగి గృహస్థాశ్రమ స్వీకార మొనరించి, మన యనుగోతయ్య మహారాష్ట్ర సభకు మరలరమ్ము. నీవు, మన సోమేశమును ఆతని కాస్థాన కవులై యుండవలెనని నా సంకల్పము.

నారా: తమరు సంకల్ప సిద్ధులు, ఇదే అభివాదము లొనరించుచున్నాను. (సాగిలఁబడి గురువునకు మ్రొక్కును) అనుగోతయ్యా! నీకడఁ గూడ సెలవుఁ గైకొనుచున్నాను. దైవానుగ్రహముచేతను, గురువరుల యాశీః ప్రభావముచేతను, నీవు క్రమ్మఱ క్షమాధవుండ నగు భాగ్యమే కల్గునేని, సింహపీఠిని గూర్చుండి నీవు నిండు కొలువుండు సమయమున, నీ దర్శన మొనరింతును. అయ్యెడ నీ పేద బాఁపనుని విస్మరింపకుమా! సాందీపని కడఁ జదువుకొన్న కుచేల కృష్ణుల చరిత్ర మదిని నిల్పుకొనుము.

అను: సోదరా! నీ యాశీస్సునకుఁ బాత్రుఁడనగు నేను నిన్ను విస్మరింతునా?

గీ॥ తన సహాధ్యాయుఁడౌ కుంభజుని మఱచిన
పాంచాలునిపాటు గురువుల వలన వినియు
గర్వినై సహపాఠి నేకరణి మఱతు?
చెలిమికన్న నధికమౌనె కలిమిబలిమి?

నర: నాయనా! మంచి మాటాడితివి. నేఁటి పాఠమునకు రెండు శ్లోకాలు మాత్రము చెప్పి విడిచి పెట్టెద. పుస్తకములఁ దెమ్ము.

కొనుము. పుల్లయ్యా! నీవుకూడ పుస్తకముఁ దీయుము.

పుల్ల : చిత్తము. శీలవతీదేవి తన కుమారుని శీఘ్రముగా లోపలికిఁ బంపుమన్నది. నేఁడాతని జన్మదినమఁట. అవ్వగారు ముత్తయిదువులచే ఆరతు లిప్పింతు రఁట.

నర : అది తెలిసియుండియే నేఁటికి రెండు శ్లోకాలే బోధింతు నంటిని. (అనువోతుఁడు, పుల్లయ్యయుఁ బొత్తములం దెఱచికొని నిలుతురు) నాయనలారా! కూర్చుండుఁడు. ఒక శ్లోకము చదివి అర్థము చెప్పెదను. మీరు శ్రద్ధగా విని, వెంటనే దాని నప్పగింపవలయు. చూతునుగాక మీ ధారణశక్తి

శ్లో॥ "సహసావిదధీతనక్రియా మవివేకఃపరమాపదాంపదమ్
వృణుతేహివిమృశ్యకారిణం గుణలుబ్ధాఃస్వయమేవసంపదః"

క్రియామ్=పనిని, సహసా=శీఘ్రముగా, నవిదధీత=చేయఁగూడదు. అవివేకః=వివేకింపకపోవుట, పరమాపదాంపదమ్=విస్తారములయిన ఆపదలకు స్థానమగును, గుణలుబ్ధాః = గుణములయం దాశకల్గిన, సంపద=సంపత్తులు, విమృశ్యకారిణం = విమర్శించి చేయువానిని, స్వయమేవ=తమంతట తామే, వృణుతేహి=వరించు చున్నవి.

తా॥ త్వరపడి యేపనిని జేయఁగూడదు. ఆలోచింపక పోవుట గొప్ప యాపదలకెల్ల మూలమగును. విమర్శించి కార్యములు చేయువానిని సంపదలు తమంతట తామే వరించుచున్నవి.

అను : (చిఱునవ్వుతో) తాతగారూ! మరల శ్లోకమును జదువుచుందురా?

నర : చదువుము, నీ యద్భుత ధారణశక్తి వెల్లడింపుము.

అను : చిత్తము (ఇంచుక తడవుకొనుచుఁ దప్పులేకుండ శ్లోకమును నప్పగించును)

నర : మేలు, బాలకా! మేలు మేలు! పుల్లయ్యా! నీవుకూడ నప్పఁ జెప్పుము.

పుల్ల : తొందరపడి యేకార్యమును జేయరాదని తమరే సెలవిచ్చితిరి గదా! నేనేల తొందరపడి అప్పగింప వలయు?

నారా : ఈ కుయుక్తులేల? నాకు రాలే దనుము.

ఫుల్ల : ఏమంత మునిఁగినదని నా మెదడు పాడిచేసికొని శ్లోకమంతయు జ్ఞప్తికిఁ దెచ్చుకోవలయు?

నర : నీ తెలివికి మెచ్చితిమి. ఇఁక నీళ్ళుతోడుటకుఁ బెరటిలోనికరుగుము.

ఫుల్ల : ఆలాగుననే వెళ్ళెదను. కాని నాకొక్క యనుమానము గలదు.

నర : అదేదో చెప్పు, తీర్చెదను.

ఫుల్ల : మీరిప్పుడు చదివిన శ్లోకము మన యనసూయ్య నేఁడు చదువవలసిన పాఠములోనిదే కదా?

నర : అవును, అయిన నేమి?

ఫుల్ల : ఆమెఁ దీపద్యమును ముందే చదువుకొని, కొన్నఁగా వల్లెవేసి యుండుటచే, నిట్లొక్కసారి విన్నంతనే యొప్పగించినట్లు నటించినాఁడేమో! లేక, మీరే యామెనిచే నీనాటక మాడించి నన్నుడికింప నెంచితిరో!

నర : ఓసి మొద్దబ్బాయి! ఎంత పెద్దాలోచనలు గా నీవి! ఇది రెండవ సర్గలో మున్నగప శ్లోకము. మఱియొక్కటి నీయిచ్చవచ్చినచోటఁ దీసియిమ్ము, చూతువుగాని.

ఫుల్ల : సరే (భారవి పుస్తకముఁ దీసి కండ్లుమూసికొని యొకచోటఁ దెఱచును) అయ్యా! ఇదే 13 వ సర్గలో 7 వ పద్యము వచ్చినది. దీనిని జదివి యర్థముఁ జెప్పుఁడు. చూతునుగాక, యీతని జ్ఞాపకశక్తి

నర : (పుస్తకముం బుచ్చుకొని యిట్లు చదువును)

శ్లో॥ మునిరస్మి నిరాగసః కుతో మే భయమిత్యేష నభూతయేఽభిమానః
పరవృద్ధిషుబద్ధమత్సరాణాం కిమివహ్యస్తి దురాత్మనామలంఘ్యమ్.

అస్మి = నేను, మునిః = మునిని, నిరాగసః = దోషరహితుఁడ, మే = నాకు, భయంకుతః = భయమెక్కడిది?, ఇతి = అని చెప్పి, ఏష అభిమానః = ఈ అహంకారము, నభూతయే = మేలుకొఱకుఁ గానిది, పరవృద్ధిషు = ఇతరుల అభివృద్ధి విషయమై, బద్ధమత్సరాణామ్ = కట్టఁబడిన అసూయగల్గిన, దురాత్మనామ్ = దురాత్ములకు, అలంఘ్యమ్ = దాటరానిది, కిమ్ ఇవ అస్తి = ఏమున్నది?

తా॥ నేను మునీశ్వరుఁడను. దోషములు లేనివాఁడను. నాకు భయమెం దులకు?— అనిచెప్పెడు గర్వము శ్రేయస్సు గల్గింపనిది. ఇతరుల వృద్ధినిగూర్చి గట్టియసూయగల దురాత్ములకు అతిక్రమింపని దేదియు లేదుగదా?

అనుమోతా! నీ భావివర్తనమున కనుకూలించు నీతిని నేర్పు పద్య మిది. పుల్లయ్య వెదకి మంచిదే యిచ్చినాఁడు. పదీ, అప్పగింపుము, నాయనా!

అను: (అవలీల అప్పగించును)

నర: ఇప్పుడేమందువు, పుల్లయ్యా? గ్రుడ్డు మిణుకరింతు వేల? నాయనా! నేఁటికిఁకఁ జాలును. లోనికేఁగుము, మీయమ్మ రమ్మన్నదఁట (అను మోతుఁడేఁగును) నారాయణా! చూచితివా యీతని ధారణా సంధాగ్రా హిత్వము? నీవు నాల్గయిదు సారులు చదివి పద్దె మప్పగింపఁగలవు. ఈ మొద్దబ్బాయి నూరుసారులు చదివినను ఏపద్యమును కంఠస్థము చేయఁ జాలఁడు.

నారా: అనుమోతునిది మన సోమేశమునకుండు కుశాగ్రబుద్ధి.

నర: కుశాగ్ర బుద్ధియే కాదు. సద్వినయము, సౌహార్దము, సౌజన్యము సౌశీల్యము—ఇవియెల్ల సతనియం దిగుడి యున్నవి. ఇవి భావికాల మున నాతనికి మహోపకార మొనర్చును. నారాయణా! నీవిఁకఁ బ్రయాణ సన్నాహము గావించుకొనుము.

పుల్ల: అనుమోతయ్య రాజైన తర్వాత నన్ను నూత్రము పోషింపఁడా?

నర: పోషింపకేమి? ఎందఱనో అనాథలను బోషించును. వానిలో నీవును నుండవచ్చును. లోనికిఁబొమ్ము.

(నిష్క్రమింతురు.)

## ద్వితీయ రంగము

రంగము: ఒక చావడి.

ప్రవేశము: పుల్లయ్య, చాకలి పుల్లిగాఁడును.

పుల్ల: పుల్లిగా! గురువుగారు ప్రయాణమునకు సిద్ధపడియున్నా రేమో చూచి రా!

ఫుల్లి : బాబూ ! పయన మేడకండి?

ఫుల్ల : ఎటుంగవఁటరా?

ఫుల్లి : తెల్లు బాబూ ! తెల్లు !

ఫుల్ల : నేను, గురువుగారు, అనుహోతయ్య, కొంత వేటసిబ్బందితో నేఁను వేటకై యరణ్యప్రాంతముల కేఁగెదము.

ఫుల్లి : బాపనయ్యలుగదా, మీకు వేఁటేఁటయ్యా?

ఫుల్ల : మాలోనందఱును బ్రాహ్మణులుకారే ! అనుహోతయ్య అనుప సీత క్షత్రియుఁడు. అతనికి గురువుగారు ధనుర్వేదము నేర్పినారు. వినోదమునకై వేటకుఁగూడఁ దీసికొని పోవుచున్నారు. వారితో నేనుగూడ వెడలి, నాకు శక్తిగలిగినంత సాయము చేయుదును.

ఫుల్లి : నువ్వేంసాయం సేత్తావయ్యా? దారిలోనిన్ను మేపలేక బాదలు పడాలేమో !

ఫుల్ల : ఓరి మూర్ఖుఁడా ! ఎంతమాటన్నావురా ! నన్ను మేపుటకు నేనేమి పశువు ననుకొంటివా?

ఫుల్లి : పసువునిన్నను ఎక్కువవాఁడవు, బాబూ ! మొన్న నువ్వు తిన్నన్ని మామిడిపళ్ళు మానిసి తినగలఁడా? కుడిచి కూర్చుండి గంపెఁడుపళ్ళూ గడియలో కాజేశావే! నువ్వొన్నన్నా, నీది గేద తిండే బాబూ ! మాజాతోళ్ళు కూడ నీఅంత తిండితిని అరగించు కోలేరు.

ఫుల్ల : ఓరి నీకంత యుడుకేలరా? మంచి తిండికే నీవు పెట్టిపుట్టలేదు. కనుక, తినఁజాలవు. పూర్వజన్మమున నేనితరులకుఁ బెట్టితినిగాన మంచితిండి తినఁగలను.

ఫుల్లి : బట్టలు గుంజి గుంజి, యెంతో ఆయాసపడతాను. అయినా, నువ్వు తిన్నంత తినలేను బాబూ ! ఏ పని చెయ్యకుండానే అంత తిండి యెలా తినఁగలవయ్యా?

ఫుల్ల : నేను నీపని, నీగాడిదపనియుఁ జేయుదును. నేనుగూడ నీవలెనే గురువుగారియింట మడికి వలయు బట్టలన్నియు గుంజుచుందును. నీ

గాడిదకన్న నెక్కువబరువు మోచికొని పొలము నుండి కూరగాయలు మున్నగునవి తెత్తును.

పుల్లి : ఇప్పు డాగాడిదపనికే నంటయ్యా, వేట కెళుతున్నావు?

పుల్ల : ఓరి, బుద్ధిహీనుఁడా? నేనేమి చేయుదునో, నీవే చూచెదువుగాని, ముందుగా ఆ ప్రక్కగదిలోని నవచాలు కొనిరా. వానిని తొడిగికొని ప్రయాణమునకు సిద్ధపడుదును.

పుల్లి : (నవ్వుచు) సిత్తం, మారాజా ! [లోపలికేగును]

పుల్ల : (తనలో) నేను చాకలివానికిఁ గూడ లోకువైతిని. నాకు చదువు రాకపోవుట చేతఁగదా యీయాఘాతము !

(చాకలివాఁడు నవచాయలు తెచ్చును)

పుల్లి : తొడగండి బాబూ ! ఎంతసక్కగా ఉంటారో సూత్తాం.

పుల్ల : [కాలికిఁజేతిని, చేతికిఁగాలిని దుస్తులు తొడిగికొనును; చేతఁగాని నందిని తలపాగ ధరించును]

పుల్లి : చాలాబాగుందయ్యా ! బారతకతలో ఆ బుహన్నలే తొడి గేదు, ఈయేల నువ్వే తొడిగావయ్యా ! ఆయన సేతకానట్టు నటనశేశాడు. నీకు సేతకాక యిలా తొడిగేవు.

పుల్ల : నిజముగా నా కాబృహన్నలతోఁ బోలిక సరిపోయినది. అతని వలెనే సమ్మోహనాస్త్రము వేసి క్రూరజంతువుల నన్నిటిని ఒక్కసారి చంపెదను. డంబములు కొట్టుటలో రెండవ ఉత్తరుఁడని చెప్పఁదగ్గ అనుపోతయ్యకునేనే సంపూర్ణజయము చేకూర్చితీసికొనివత్తును

(వీధిలో పుల్లిగాని గాడిద ఓండ్రపెట్టుట విని ఉలికి పడును)

పుల్లి : వెఱ్ఱి బాపనయ్య! నువ్వంతోడవే! మాగాడిద కూఁతకే నీసేత నాలు సెడ్డాయిగందా, యింక పుల్లూ సింగాలూ అరస్తే, నువ్వేలా నాట్యంసేత్తావో, ఎలాపరుగులెడతావో సూడాలనుంది. మాటల్లో, కూడు తినడంలోనూ, ఈరుడవయ్యా.

పుల్ల : నోరు మూయుము. నేనంత చేతగానివాఁడననుకొంటివా? మాబ్రాహ్మణులు గట్టిగాఁదలఁచుకొందురేని, చేయఁజాలని పను లుండునా?

పుల్లి: ఆమాట నిజమే. గట్టిగా తల్చుకోడానికి, నీకు మొదడుంటే గదయ్యా? వయసు మీరినా, ఆ మాట నరసన్నగారి పట్ల అను, నే నొప్పుకుంటా.

(ప్రవేశము నరసన్నభట్టు)

నర: ఏమిరా, చాకలీ! మా మొద్దాబ్బాయితో వాదించుచున్నావు?

పుల్లి: బాబూ! ఈ పుల్లయ్యగోరు ఏటలో జంతువులన్నిటినీ పాడి సేత్తారంట. అనువోతయ్యకి సాయంసేత్తారంట. అందుకోసం ఎంత బాగా తయారయారో సూడండి, బాబూ!

నర: (పుల్లయ్య కేసి తేఱి చూచి) ఓరి మూర్ఖుఁడా! ఇదేమి కవచ ధారణమురా?

పుల్ల: స్వామి! నాకెట్లు తెలియఁగలదు? "ఇవి కాలికి, ఇవి చేతికి" అని దుస్తులపై లిఖించియుంపరైతిరి.

నర: భోజన సామగ్రులలో ఇదికూర, ఇదిపచ్చడి, ఇదిపప్పు అనుభేదములు, ఎట్టివ్రాఁతయు లేకుండఁగనే, గ్రహింపఁగల మహామేధావివి కవచధారణ మెట్లో గ్రహింప లేకపోయితివే! ఈ తెలివి తక్కువ మాటలు కట్టిపెట్టి పయనము కమ్ము.

పుల్ల: ఆ తయారులోనే యున్నాను. స్వామీ!

నర: అనువోతునికిఁగావలసిన దుస్తులన్నియు నుదికి తెచ్చితివా? చాకలీ!

పుల్లి: తెచ్చితిని, బాబూ!

నర: మన గారయ్యదొర దగ్గఱకేఁగి, వేఁట సిబ్బందితో సిద్ధముగా నుండుమనుము. అప్పన్నను బండ్లు కట్టుకొని రమ్మను. నీవు కూడ మాతో రావలెను.

పుల్లి: సిత్తం బాబూ! పుల్లయ్యగారి వేట తెలివి సూడాలని నాకూ మనసుంది. తప్పకుండా వత్తాను. సెలవు దయసేయండి.

(నిష్క్రమింతురు)

# తృతీయరంగము

రంగము: అడవి.

ప్రవేశము: అనువోతుఁడు, నరసన్నభట్టు, వేటసరంజామము.

అను: తాతగారూ, నాకునేర్పిన అస్త్రవిద్య లక్ష్యలక్షణ సమన్వయము చేయుటకే గదా నన్నీయరణ్యసీమకుం దోడ్కొని వచ్చితిరి?

నర: అవును, బాబూ! అలనాఁడు శ్రీరామచంద్రుఁడు విశ్వామిత్రప్రేరితుఁడై కాననప్రదేశమున కేతెంచి తాటకాది రాక్షసుల సంహరించి సాధుజనుల కుపకారము గావించిన విధాన, నీవు కూడ దుష్టవిరోధిసంహార మొనర్చి మముబోంట్ల కుపకారము చేయవలసియున్నది.

అను: వేట సప్తవ్యసనములలో నొకటియని చెప్పుదురు గదా, అది రాజుల కెట్లు ధర్మమగును?

నర:

పరులకుఁగీడు సల్పకయ పచ్చికకై చను సాధుజంతులన్
కఱకు శిలీముఖమ్ములను గాసిలఁజేయుట పాపమౌను, భీ
కరముగ హింసఁజేసెడు మృగమ్ములఁజంప నఘమ్ముగాదు, పెం
దరహానిగూర్చు పుణ్యమగు; ధర్మ్యమె వేట నృపాలకోటికిన్.

అను: ఆర్యా! తమమాట కాదనను కాని,

జననమొందిన దొక్క బ్రాహ్మణగృహమ్ము;
తినెడుతిండి కేవల సత్వగుణయుతమ్ము,
మనెడుమన్కి పండితబృందమధ్యసీమ
సాధ్యమగునెట్లు నాకు హింసాక్రమంబు?

నర: బాబూ! నీవు చెప్పినమాటయు నిజమే. అయినను,

హరికిశోరమ్మునకు మదహస్తియూథ
సంహరణకార్య మేరీతి సహజమగునొ
క్షత్రజాతిబాలకునకునైత మట్టులె
శత్రునిర్మూలనక్రియ సాజమగును.

నీవొక యనుపనీతక్షత్రియ బాలుఁడవు. మా యింట నుండుటచేఁ బ్రకృతమున నీ తేజము మాటువడి యున్నది. అది బహిర్గతమగు సమయ మచిరకాలములో వచ్చును.

ఫుల్లి: అయ్యలారా! చచ్చితిఁ జచ్చితి. ఎవఁడో అడవి మనుష్యుఁడు మన సైపు నచ్చుచున్నాఁడు. ఓయి నాయనో! నేఁటితో నా యాయువు ముగిసినది. అమ్మా! నీకున్న కొడుకొక్కఁడును బలవన్మరణ మొందుచున్నాఁడే. (ఏడ్చును)

అను: అన్నా! అంతలోనే యేడుపా? ఏఁడీ, ఆటవికుఁడు?

ఫుల్లి: ఆ దేహమంతయు. ఒడలంతయు వెండ్రుకలే. అదిగో, ఇప్పుడునాలుగు కాళ్ళ జంతువులాగు నడుచుచున్నాఁడు. ఈసారి, మనలాగే రెండు కాళ్ళపై నిలిచియున్నాఁడు.

నర: ఓరి మొద్దా! అది యెలుగు గొడ్డురా! ఓరీ, ఫుల్లిగా! కొన్ని యెండాకులు ప్రోగుఁజేసి మంటఁబెట్టుము. ఎలుగున కగ్గిఁజూచిన నడలు. (ఫుల్లిగాఁడు మంటఁబెట్టును. ఎలుగుబంటి పాఱి పోవును.)

నర: ఓరీ! ఈ యడవిలో నడుగడుగునకుఁజచ్చుచు మరలఁబుట్టుచు నుందువా? ఇంకను ముందున్నది ముసుళ్ళపండుగ. ఏ వ్యాఘ్రమో, సింహమో, మనలనెదుర్కొన వచ్చు. అప్పుడు కప్పిగంతులు వైతువు కాఁబోలు! నడువుము (పోవుదురు)

(తెరపడును, ఇంకొక తెరలేచును.)

అను: ఆర్యా! దవ్వునకన్పట్టు గ్రామము పేరేమి?

నర: అదియే పెనమీడు, ఈ మైదానముననే తొల్లి నీ జనకునకును ఫూసపాటి మాధవ వర్మకును రణముప్రవర్తిల్లినది.

అను: మహాత్మా! ఇదా మా పెద్దలపూతరక్త ప్రవాహముచేఁ దడిసిన పుణ్యభూమి? దీనింగాంచుటచే నాజన్మము ధన్యమైనది.

నర: నిజముగా నీవు ధన్యుఁడవైతివి.

సీ॥ ఈపుణ్యభూమియే నీపితృబాంధవ
రక్తభాగీరథీ ప్లావితమ్ము
ఈపవిత్ర ధరిత్రియే రావువంశమ
హావీర మరణశయ్యాతలమ్ము
ఈపూతధారణియే రవినిభ పద్మ
నాయక తేజస్స్నాతనమ్ము
ఈనిర్మలావనియే వెల్మశౌర్యర
మాలాస్య నేపథ్యమధ్యసీమ

గీ॥ అట్టి దీపావన క్షేత్రమగుట, బాల!
భవదమల వంశజాత భూవరులకెల్ల
ఇది కురుక్షేత్రమగు, దీని మదినినిలిపి
యాత్ర సేయుట ముఖ్య కార్యమ్మునుమ్మి।

అను: మహానుభావా! తెలిసినది. ఈ పవిత్రోద్దేశముతోనా నన్నిచటికి మృగయావ్యాజమునఁ గొనివచ్చితిరి? ఆహా! కృతార్థుఁడను పితరులారా!

నిరుపమ కీర్తికౌముది వినిర్గతిఁ జేసి, పవిత్ర రావువం
శరజనికెల్లఁదేజమునొసంగిన శారదచంద్రు లీరలో
వరపథగాములార, పరిపంథి నిరాసనకార్యమూని మీ
పరిభవదుఃఖమున్ దొలఁచువాఁడ ధరాస్థలిపీడులోపలన్

నర: [తనలో] నేను సంకల్పించినరీతిని వీనికి, వీరరసోద్రేకము, కలుగుచున్నది. ఇంకను దానిని బురెక్కింతుఁగాక! [ప్రకాశముగా] నాయనా!

చలచలక్రాఁగు నూనియల చట్టుల రావుకులప్రధానులన్
చలమునఁ గూలఁద్రోసి యమసన్నిధి కంపిన చోటిదేసుమీ:
కలుష మనస్కులై చెఱకుగానుఁగలం బీనిపించి వెల్మయో
ధుల నరిరాక్షసుల్ మిగులఁద్రుంచిన ఘోరరణస్థలంబిదే।

అభిమన్యునట్టులే యందఱొక్కటఁగూడి
సింగమనీనిఁ ద్రుంచినదియిచట
ద్రుపదాత్మజానిభంగి దుష్టతన్ యాచమ
నీనిఁ జితవద మొందించి రచట

పడ ముడిచూలినింబలెఁ గపటరణాన
వెన్నుమసినిఁ జంపినది యిచట
తన తేరు సవరించుకొను కర్ణునింబోలె
సర్వసేనాపతిం జదిపిరచట.

గజదళంబులు కసిమసంగఁ బడెనిచట
ఘోటకవ్రజములనెల్లఁ గూల్చిరచట
కాల్బలము పెద్దనిద్దురం గాంచెనిచట
వెలమ పౌరుషం బిందె మున్ వెలసిచనియె

ఈ మారణ కృత్యములన్నియు ముగిసిన తర్వాత మాధవవర్మ తృప్తిఁజెంది, మంత్రులతో

ఎన్నఁడు పద్మనాయకకులేందిర భర్తృవిహీనయౌను, నిం
కెన్నఁడు రావువంశనది యింకి యెడారిగ మారిపోవు, నే
నెన్నఁడు కన్నులార నిదురింతు, నిఁకెన్నఁడిఁకెన్నఁడంచు నా
పన్నుఁడనై యుమేశుఁ గొలువన్ గృతకృత్యుఁడనైతినేఁటికిన్

అనిపలికినాఁడు. తనయిష్టదైవమగు భైరవస్వామికిఁ బూజలు చేయించినాఁడు.

అను: తాతగారు! మీరీ యంశములఁ జెప్పుకొలఁది నారక్తమధి కోష్ణతం గాంచుచుండెను. మహాపరాక్రమ శాలియగు నా తండ్రి పాటు విన్న, దుఃఖోద్రేకముచే నా కంటి కొలుకులనుండి కవోష్ణ బాష్పములు జాలువారు చుండెను. ఓ తండ్రీ!

భీమపరాక్రమాఢ్యుఁడని పేరుగడించిన సత్వశాలి వీ
వే మగపాడిఁగోలుపడి, హీనవిరోధి నృపాల జాలికున్
తామసునోర్వలేకునికి, తార్క్ష్యుఁడు కాలము దప్పుటన్ నిజ
స్థేమము వీడి, యొక్క జలజిహ్మగఘాటికిఁ బాలినట్లగున్

ఆహా! భగవానుఁడా!

కటకటా! రావుకుల తటాకంబులోని
బిసరుహాముకుళ మొక్కటే విడిచియుంచి
ఫుల్లపద్మకాండము లెల్లఁ బెల్లగింతె,
దైవమా! కన్నుగుట్టెనే దాని సొగసు!

నర: నాయనా! నీవు ఖేదమందరాదు, నీ పెద్దల ధైర్యసాహసముల నలవఱ్చుకొనవలయుఁగాని. వారు పరలోకమునుండి నిన్నాశీర్వదించుచుందురు. వారియాత్మలు శాంతి పొందునట్లు నీవు శత్రు నిర్మూలన కార్యమునకుఁ బూనవలయు.

అను: తప్పకపూనెద. అరిరక్తములతో నాపితరులకుఁ దర్పణములు విడుతును.

శత్రురాజమకుట స్థగిత దివ్యమణిత
తియె దేవతార్చిత తిలలుగాఁగ
పరిమళతైలలిప్త విరోధినృప శిరో
జనికాయమే దర్భజాలములుగ
అభిషేక శుభసమయావభృతస్నాత
విహితారి శిరములే పిండములుగ
మచ్చమూపతి సమూహోచ్చారితోత్సాహ
వాక్యంబులే మంత్ర వాక్యములుగ

వైరికంఠోద్గత రుధిర ధారలే తి
లోదకమ్ములుగాఁగ విధ్యుక్త ఫణితి
మత్పితృనిలింప శ్రాద్ధకర్మమ్ము సలిపి
తృప్తిఁగావింతుఁ గాంచెద ఋణవిముక్తి!

నర: బాబూ! నీవు సిద్ధసంకల్పుఁడవయ్యెదవు. ఇంక మనమిచ్చోటు వాసి పోదము. శకట మారోహింపుము.

పుల్ల: ప్రొద్దు క్రుంకవచ్చినది. నాప్రాణము పోయినను సరే, నీవెక్క యడుగైనఁగదలను. నాతిండి మాటయేమి?

నర: ఓరి తిండిపోఁతా! ఇప్పుడేకదా పాతిక యరఁటిపండ్లు సనలిలుఁ దింటివి? ఇంతలో నాఁకలియైనదిరా? వృకోదరునివలెఁ గన్పట్టు చున్నావే!

అను: అన్నా! దారిలో నీకుఁగావలసినంత యాహారమిత్తుము. లెమ్ము, బయలుదేఱు.

పుల్ల: సరే, నన్ను లేవఁదీయుము. నా సత్తువ బొత్తిగా సన్నగిల్లినది
(అనుపోతుఁడు లేవఁదీయ లేచి నిలుచుండును)

(తెరలేచును)

రంగము : భువనగిరి కోట.

(ప్రవేశము : అనువోషుఁడు, నరసన్నయు.)

అను: తాతగారూ! ఈ కొండకోట యిట్లు శిథిలమై యున్న దేమి?

నర: బాబూ! ఇది పూర్వకాలమున మీదే. ఇప్పుడు మాధవవర్మ వశమై యున్నది. అతఁడీ పవిత్రదుర్గము పాడుపఱచి యుంచినాఁడు. ఇందే నీ తల్లితప్పఁ దక్కుఁగల రాణివాసంపుఁ గాంతలెల్ల అగ్నిప్రవేశ మొనర్చిరి.

> పసుపుంగందము మేనఁబూసి, నునుఁ గూర్పాసంబులందాల్చి, యిం
> పెసఁగన్ స్వర్ణపు టంబరమ్ముల మణీ బృందమ్ములం గట్టియున్
> నొసటన్ గుంకుమ బొట్లు దిద్ది, సుమసందోహంబులం బూని సం
> తస మొప్పారఁగఁ బెండ్లివేడుకనఁ గాంతల్ సొచ్చి రాయగ్నిలో.

అను: ఆర్యా! మీ నుడులు విన్న కొలఁది నా ఖేద మతిశయించుచున్నది. ఘోరకిరాత సన్నిభుఁడగు తన్మాధవవర్మాభిఖ్యుఁడేఁగదా మా కులమున కింత చేటు వాటిల్లె? నాకుఁదగిన ఆయువేయున్న, ఆ నీచుని సమిత్రబాంధవముగఁ దెగటార్చి క్రోధాగ్ని చల్లార్చుకొందును.

నర: వత్సా! నీ తలఁపులన్నియు ఫలించును. ఆ దుష్టుఁడు నశించుకాల మాసన్నమైనది. వాఁడీనడుమ నిన్నుఁ బరీక్షించుటకఁట చారులఁ బంపినాఁడు. వారు నిన్నుఁ జూచియు ఆనవాలు పట్టఁజాలక పోయిరఁట. నీవిఁక కంది కుందకుము. మనము సత్వరము యింటికిఁ బోదము రా.

పుల్ల: గురువుగారూ! మీ రిరువురు నిట్లు చూచిన చోటులే మరలఁ జూచుచుఁ, జెప్పుకొన్న మాటలే మరలఁ జెప్పుకొనుచు, నెంతసే పుందురు? నా కడుపులో దహించుకొని పోవుచున్నది. నే నిఁక బ్రదుకను. నన్ను వృథాగాఁ జంపి బ్రహ్మహత్యాపాతకముఁ గట్టుకొనకుఁడు.

నర : ఓరి మూర్ఖుఁడా! సమయాసమయము తెలియఁగకుండ మమ్ము తొందరపెట్టెద వేలరా? నిరంతరము తిండి గొడవయే? బాబూ! మనమింకఁబోదము రమ్ము. ఇచ్చోటు క్రమ్మఱ నీ వలననే సిరుల కాటపట్టగును. నేను యోగదృష్టిని గ్రహించితిని. ప్రాప్తికాలము సమీపించినది. పద—

(నిష్క్రమింతురు)

## చతుర్థాంకము

### ప్రథమ రంగము

(రంగము : నరసన్న గారి పొలము)
(ప్రవేశము : రేచిగాఁడు నేల దున్నుచుఁ బాటపాడును)

రేచి॥ పంటవలఁతీ మాయమ్మ ! మా బాద తీర్పవే !
పేదసాదలెల్ల బ్రతుకు—పెద్ద పంట పండఁజేసి
నీ దయాగుణమ్ము చూపు — నిన్నెనమ్మియుందుమమ్మ ॥పం॥
జాలి గుండె గలుగు సామి — నేలి సిరుల నెల్లనిమ్ము
చాల కాల మతఁడు — చక్కనైన పనులు సేయ॥ పం॥

అను : [ప్రవేశించి] రేచయ్యా! ఆనందముతో పాట పాడుచుంటివే!

రేచి : బాబూ! ఏలాగో లేని సంతోసం తెచ్చుకొని యిలా పాడుకొంటూ ఉంటాను. ఈ పాట కిన్నయ్య బాబుగారు నాకోసం చేసి పెట్టారు. ఇంటికి పోతే అంతా నోగులేకంధా! నా పాట మాటకేం గాని, బాబూ! అందరిలాగా నన్ను "రేచిగా" అని పిలవక, "రేచయ్యా" అనిమన్నిత్తారేం? గొప్ప పెబువులే!

అను : ఓయీ! మమ్ము నీవు తప్పక మన్నింపవలయునా? నిన్ను మేము మన్నింపరాదా? ఇదెక్కడి న్యాయము? గౌరవ మిచ్చికదా గౌరవము పుచ్చుకొన వలయు?

రేచి : బాబూ! ఈ లాంటి ఉద్దేశాలందరికీ ఉండవు. తమలాంటి కాఁగల పెబువుల కొక్కరికే ఉంటాయి. మళ్ళా అయ్యగారి రాజ్జెం మీా కొత్తే మా పెద్ద కులాన్ని పైకెత్తేరన్న మాట.

అను : అట్టి యదృష్టమే నాకుఁ బట్టినయెడ, హేళనమునకు పెద్దకుల మని పిలువఁబడు మీ కులమును నిజమైన పెద్ద కొలముగా మార్చి నతును. మీకు విద్యాశాలలు, సంరక్షణశాలలు మున్నగునవి నిర్మించి అస్పృశ్యతను పోపెదను.

రేచి : మారాజా ! మీ ఉద్దేశాలుంటే పెబువులు మరి పదిమంది ఇట్టా దేశంలో ఉంటే, మా మాలకొలమే కాదు, తక్కువ కులా లన్నీ పైకి లేస్తాయి. పజకెంతో సుకం ఉంటాది.

అను : ఒకన్ని నరమాత్రుని మహారాజుగాఁ జేసి బహు ప్రజపై నధికారము నొసంగుటలో భగవంతుని యభిప్రాయ మట్టిదే కదా !

ఉరువగు మానసమున్ మడుఁగు టన్నము నేయియుఁ బంచదారయున్
గరము రుచించు భక్ష్యములుఁ గమ్మని తిండ్లు, భుజించుచున్ నిరం
తర మధుపానలోలురయి తామరతంపరయై సుఖంబులన్
బరఁగుట కీశ్వరుండు నరపాలురఁ సృష్టి యొనర్పలేదుగా !

కొందఱు మాత్రమే సుతులఁ గూఁతుల లోకములోని మానవుం
డొందు : నృపాలుఁ డెల్ల ప్రజయున్ జనసంతతి గాఁగఁ గాంచుఁ, దా
నెందును వారి సౌఖ్యమునకే పనియుం బలుకున్ దలంపులన్
జెందఁగఁ జేయుఁ, గాన స్థిరచిత్తుఁడు గాఁడు మహీశుఁ డెన్నఁడున్

రేచి : ఇంత గొప్పాలోసనలు మీకున్నాయి కనకే, మీరు చాలా బాగ్గెం సేసి పుట్టారనీ, అయ్యగారి కన్నా గొప్ప మారాజు లవు తారనీ, లచ్చి మీ యింటె యెప్పుడూ కాఁపురం ఉంటాదనీ, నరసన్నగారు మాతో ఎన్నోసార్లు సెప్పారు. ఆయన మాటలు బమ్మదేవర మాటలే.

(రేచ గాఁడు మన్నుచుండ, ఏదో నాఁగటికి తగిలి ఖణిల్లని మ్రోఁత పెట్టును).

అను : రేచయ్యా ! ఆధ్వని యేమి?

రేచి : బాబూ ! ఏదో నాఁగలి కొనకి తగిలింది, ఒక యినుప మండిగ లాగుందండి.

అను : మన్ను పెల్లగించి దానిని తీయుము.

రేచి : (నవ్వు తీయును. అది కదలదు) బాబూ! ఇదో పెద్ద పాత్రలాగుంది. ఊడి పడకుండా ఉందే!

అను : గునపముతో త్రవ్వి చూడు సోమయ్యా!

రేచి : (త్రవ్వి చూచును. అది కదలకున్న) సాబూ! ఇది కదలడం లేదు. నా ఒడలంతా చెమటలు పోశాయి, చేతా అలసి పోయాను. ఇంటికి పోయి, ఇంత గంజి తాగి మళ్ళీ వస్తాను.

అను : సరే, పోయిరా. ఈ లోపల ఆ పాకలోపల నులకమంచముపై కొంచెము సేపు పవళించి విశ్రాంతిఁ దీసికొందును, (ఆవులించును) కాలుగనుక నిద్దురబద్ధకముగ నున్నది. (రేచిగాఁడు నాగలిని విడిచి పోవును. అను పోతుఁడు మంచె నెక్కును)

అను : (తనలో) భువనగిరి దుర్గ సమీపమును గాపించిన నాఁటి నుండియు నా తలఁపులు పలువోకలు పోవుచున్నవి మనస్సు కుదురుట లేకున్నది. శత్రురక్తముతోఁ దమకుఁ దిలోదకము విడిచినఁగాని ఆత్మశాంతి గల్గదని అవసాన సమయమున నా తండ్రి నుడివెనఁట. అది యెన్నఁటి కీని నెఱవేర్పఁగలనా? దానికిఁదగిన ధనము, జనము నా కెట్లు లభించును? ధనమున్న జనమున కేమికొదువ? రెండునుం గలిగినను, పరమేశ్వరానుకూల్యము లభింపవలెనుగదా! పరమేశ్వరా! నీ చేయిదములు విపరీతములు.

జనకుల్ కాంచన సింహపీఠముల రాజ్యశ్రీలతోఁ గ్రాలఁగాఁ
దనయుండీగతి నొక్క కాఁపుని కేదారంబులో నుండు ప
త్రనికాయ్యంబున గడ్డిమంచెపయి నిద్రంబోవ యత్నించెడున్
అనుభోగంబునఁబ్రాణులెవ్వరికి వారై యుంద్రుగా ధాత్రిలో!

దేశకాలములు మారఁగూడదా? తాతగారి జ్యోతిషము నిజము కాఁగూడదా?

దైవమే యనుకూలింపఁ దలఁచునేని
ఘల్లుఘల్లు రనుచు మ్రోయుగజ్జె లొప్పఁ
గాముఁగన్నమ్మ, నలమేలిపాములొప్పు,
లక్కుమమ్మ మాయింటికి రాకయున్నె?

అను : [ఒడలు విరుచుకొనుచు] రేచయ్యా ! తిండీదిని వచ్చితివా?

రేచి : ఏం తినడం బాబూ ! ఇంతగంజి సీల్చి వచ్చేశా. కొడుకులు, కోడళ్ళూ చెడతాగి సావగొట్టారు.

అను : అయ్యో ! పాపము నన్నుఁబిలువలేక పోయితివా? వారిని చీవాట్లు పెట్టియుందును.

రేచి : బాబూ ! ఆమాటకేమిగాని, ఇందాక కలవరించారు, ఏదనా కలొచ్చిందా?

అను : నిజముగా ఒక కలయేవచ్చినది సుమా !

రేచి : ఏమని ఆకల? బాబూ !

అను : ఒక అందమైన కొలను, అందొక తెల్లని తామరపువ్వు. దాని నడుమ నొక చక్కని చాన కూర్చున్నది. ఆమె కిరువంకల నేనుఁగులు నిలిచి తొండములతో నీ రభిషేక మొనరించు చున్నవి. ఆ యింతి చిఱునవ్వుతో నావంకఁ జూచి "నాయనా ! ఇందాఁక రేచిగాని పొలమునకుఁ దగిలిన దొక గోలెము. దాని నిండ బంగారము కలదు. నీ వంశములోనివాఁడగు ఘనుఁడొకఁడు దానిని పాతిపెట్టినాఁడు. దానిహక్కు నీదే. కాని, అది నరబలిలేని దేరాదు" అని పల్కినది. నేనాశ్చర్య పడితిని. ఏదో చెప్పఁ బోయితిని గాని, నీవు లేపితివి. కల కఱఁగిపోయినది.

రేచి : బాబుగారూ ! ఇంకోపాలి తవ్వి సూత్తాను. [గాఢ కదలుచు] ఇది నిజంగా లచ్చి పెబావమే. నరబలివ్వండి. వచ్చేత్తది — బిందెలో బంగారం ఉన్న మోతే ఇనబడుతూంది.

అను : నరబలియేమి? రేచయా ! ఎవ్వరైనా నవ్వరా?

రేచి : మీరు నిదరోతుండగా, ఒక నాగుపాము వచ్చి, మీ తలకి గొడుగు పట్టిందండి. మీరు గొప్ప పెబువులై తీరతారు. నరసన్న గారు ఇలాంటి కతలెన్నో సెప్పారు. పానలు వల్లండి.

అను : నీకేమి వెఱ్ఱియా? ఈ శకునాలు నమ్మియా భావి నిర్ణయము చేయుట?

గేచి: కొన్ని నమ్మాలండి, పసుపుతనాన్ని మీరు నమ్మకున్నా, ముందు ముందు, పిల్లలు పుట్టింతరవాత అన్నీ నమ్ముతారండి... నరబలిని గురించి నేనో సలహా యిత్తానండి.

అను: అదేదో చెప్పు.

గేచి: సదువుకోని వోడు, మాలోడు, సెప్పేడని తోసి పుచ్చకండి. నేను సెప్పినట్లు సెయ్యండి.

అను: అదేదో తెలిసిసంగదా?

గేచి: ఆలాగ్గె వినండి. నాకేనుగురు కొడుకులని మీకు తెల్సుగందా?

అను: కొంపదీసి వాళ్ళలో ఒకని బలియిత్తు ననెదవా?

గేచి: ఎంత మాటాడేసూ! నా పానాలన్నీ నాపిల్లలమీద ఉంటాయి గందా! ఆళ్ళల్లో ఒకర్నైనా పోగొట్టుకోగలనా! అదిగాదు నా ఉద్దేశం, యినండి, నా కొడుకులూ, కోడళ్ళూ, సెడతాగి నామొముక లిరగ కొట్టడం ఎరుగుదురు గందా...

అను: ఎఱుఁగుదును. ఎఱిగిన?

గేచి: ఆళ్ళ బాద నే పడలేకున్నాను. ఆళ్ళ నిడిచి మనలేకుండానూ ఉన్నాను.

అను: కనుక నిన్నే బలిగొనుమందువా?

గేచి: అవునండి! అనుమానించకండి.

అను: హరి! హరి! ఎంత మాటాడితివి!

గేచి: మీలాంటి ఎన్న మనసు గలోరికి ఇది చేయరాని పనిలాగే కనబడతాది కాని, బాగా ఆలోచించండి. నా బాద తప్పించిన పున్నెమూ, అంత బంగారం ఒక్కసారి ఒళ్ళోపడ్డ లాబమూ— రెండూ వత్తాయి. నాను గాకుంటే నరబలికి మీకింకోరు దొరకరు. నరబలి త్తేగాని, గోలెం రాదు. బాగా ఓజన సెయ్యండి.

అను : బంగారము లభింపకున్న, పోనీ; నిన్ను సుపుత్రుని బలియియ్యఁ జాలను.

రేచి : బాబూ! నా మాట యినండి, నన్ను బలవంతాన్ని అప్పసం సేత్తే తప్పు. నా అంత నానే మిమ్ముల్నోరుకూంటే, అలమానో తప్పేంటి? ఎనక తీయకండి.

అను : ప్రాణాలమీఁద రోఁతపుట్టి దానిని త్యజించుట కీవు తెగింప వచ్చును. కాని, నీ మంచితనమెఱిఁగియు, సర్వమానవ సౌభ్రాత్రము వహింప వలయునని తలఁపు గలవాఁడనై యుండియు, ఎట్టి జీవహింసయుఁ జేయరాదని నిర్ణయ బుద్ధి గలవాఁడ నగుటయు, నిన్నే...లాగు... వధింపఁగలను? వధను గూర్చివిన్న, తాతగారేమందురు?

రేచి : తాతగోరి దగ్గర కెళ్ళి ''రేచిగాణ్ణి బలియియ్యనా!'' అని అడిగితే, ఆయనగోరొప్పుకోరు'' వాసనమారాజు అవడంసేత పానాలు తియ్యడాని కిట్టపడరు. కాని, అంతా జరిగిపోనాక "గతిలేక రేచిగాణ్ణి బలిచ్చా'' ననండి...ఆయనేమీ అనరు.

అను : తాతగారేమియు అనకపోయినను, నా మనస్సాక్షి నన్నుఁ గుట్టదా? నన్నేగాక, ఆధన మనుభవించు నా సంతతి వారి హృదయాలనెల్ల విదారింపదా?

రేచి : ఆలాగైతే, ఒక ఉపాయం సెప్తాతా, యినండి... మీ దేగోతరం?

అను : నా గోత్రము మాట నీ కెందులకుఁ? మాది వాసిష్ఠసగోత్రము.

రేచి : నన్ను బలిచ్చి, మీ గోతరం పేరు నా పేరు మీదుగా మార్చు కోండి. మీ కులం ఉన్నన్నినాళ్ళు నా పేరు తిరంగా, బూమిమ్మీద నిలుత్తాది. మరోసంగతి — మా మాలకోలానికి మీ రావు వారంతా ఒక మేలు సెయ్యాలి.

అను : అదేమి? రావు వారందఱు చేయుటేమి?

రేచి : మీ యిళ్ళల్లో ఏ పిల్లయినా, మా వాళ్ళల్లో ఒకరికి ముందుగా కట్నాలిచ్చి పెళ్ళి చేయించండి. ఆళ్ళ తలంబ్రాలు మీరు పోసుకోండి. ఈ గలపు నరకులకి మీ రొప్పుకుని నన్ను బలివ్వండి. మీ కోసమేమీ ఉండను. ఆ సెరువులో తానమాడి వత్తాను. కత్తిని నే నూరుకొనివత్తా... బాబ్బాబు! నాకీ లోకంలో దినదిన గండం తప్పించాలి.

అను : ఓయబ్బా! నీ సాహసము చాల చిత్రముగా నున్నది. ప్రాణాల మీఁద నెంత విసుగు పుట్టినను, నీవలె బలికి సిద్ధపడువారుండరు. ఆ పాత్రే, బలి యిచ్చినఁగాని — అందునను నరబలి యిచ్చినఁగాని కరుణింపదనుట మఱియు వింతగా నున్నది. సకలప్రాణి సంరక్షణ మొనర్పఁజాలినను దేవత ఒక్క జనుని భక్షింపఁగోరునా? అజ్ఞానుల వలె నేను గూడ మూఢవిశ్వాసమునకు లోను గావలసినదేయగునా? చిరకాల సేవకుఁడ వగునిన్ను అన్యాయముగా తెగటార్పవలెనా?

రేచి : ఈ సంకోచాలన్నీ కట్టిపెట్టండి. నా మాటయినండి, నరసన్నగోరు వత్తే, ఏ సత్తిపోతాది.

అను : రేచయ్యా! నాకు విత్తము చేకూర్చుటకే, ఊరక ప్రాణము లర్పింతు నందు వేమోయి?

రేచి : ఒక జీవానికి బాద కలిగిత్తే కాని, యింకో జీవనానికి సుకం రాదు. చీమల్ని తిని బల్లులు, బల్లుల్ని తిని పిట్టలు, పిట్టల్ని కొట్టి నరులూ, బతకటం లేదా? అదీగాక, నా వేటి, బతుకేటి? సావు బతుకులీ బొందికిగాని, లోపలి ఆత్మకి లేవు గందా! నా బొంది సాలా బాదల్లో ఉంది? ఆ బాదలు తప్పించండి, బాబూ–అన్నాను గాని, మరోటి కాదే!

అను : నీవు గొప్ప వేదాంతివి, రేచయ్యా, ఇదేమి, నా ఒడలు నాకు తెలియకున్నది! ఏదో విస్మృతి కలుగుచున్నదే (ఒకవాణి శ్రవణగోచరమగుచుండఁగా) ఆఁ! ఏమనుచున్నావు? ఆలసింపక వానిం దెగవ్రేయ మనుచున్నావా? ఎవరవు నీవు? నీ శరీర మెక్కడ?

రేచి : అది ఆకాశవాణండి. మిమ్ము తొందర పడుతూందండి. నా సావు దేవునికి యిష్టమే! యింక జాగు సేయకండి.

అను : రేచయ్యా! లేలెమ్మని ఎవరో నన్ను పిలుచుచున్నారు. (నడచి పోవుచు) నన్ను పట్టుకో, నా తల తిరుగుచున్నది.

రేచి : లెండి బాబూ! లెండి (ఒక కత్తిని అనుపోతుని చేతికిచ్చి, ధైర్యముగాఁ గొలనిగట్టుపంకఁ గొంపోవును) (తెరవాలు)

అను : ఎవరు నీవు? నన్నిట్టి దునియు మన్నావేమి? ఇదేమి నిర్బంధము? నా చేతి కిత్తువు? ఈ యమలాత్ముని చంపలేను. అయ్యో! కరమును బట్టితివేమే? మాయాస్వరూపిణీ! నీనిని ఖండించుటకే! వలదు, వలదు, అతిఘోరకార్యము! హా! హా? (తెరపడును)

# చతుర్థాంకము

## ద్వితీయ రంగము

రంగము : చెరువుగట్టు

(ప్రవేశము : అనుపోతుఁడు, నరసన్న భట్టు.)

నర : నాయనా! ఆలాగున్నావేమి?

అను :

భూతమొ, దయ్యమో మఱియపూర్వపుశక్తియొ, యావహించి, నా
చేతఁగటారియుంచి, మనసేవకు, రేచశిరమ్ముఁ ద్రుంచి, భూ
పాతమునొందఁజేసె: బహుపాపముఁ జేసితి నో గురూత్తమా!
పూతయశమ్ము మాపి, పరిభూతమొనర్చితి మీ ప్రబోధముల్.

హృదయము భగ్గు భగ్గు మని యేర్చెడు రేచయ వర్తనమ్ము నా
మదిని దలంప; భూరిధనమండలిఁ గూర్చి మందువిజ్ఞ నన్నుఁగా
మదిమది మండలేశ్వరుఁగ మార్పఁ ద్యజించెనతండు ప్రాణమేః
వదలదు తన్మహాదురిత భారము నన్ను, మనంగ నేర్తునే?

(ఏడ్చును)

నర : బాబూ! ఏమది? ధనమేమి, రేచిగాఁడు నీకుఁగూర్చ యత్నించుటేమి, ప్రాణము త్యజించుటేమి? ఆ కథయంతయుఁ జెప్పుము.

అను : (గాద్గద్యముతో) తాతగారూ! రేచయ్య నేల దున్నుచుండ నొక గోలెము హలంపు మొనకుఁ దగిలినది. దానిం దీయ నాతఁడెంత ప్రయాస పడినను అది రాదయ్యె. అతండింటికేఁగి మరలవత్తునని పోయెను. అంతలో నాకు నిదురవట్టె నొక కలవచ్చినది. అందు లక్ష్మి ప్రసన్నురాలై నరబలి యడిగినది. ఆ స్వప్నానంతరము రేచయతోఁ జెప్ప, నతఁడు తన్నే బలిగా నర్పింపుమని నన్ను బలవంత పెట్టినాఁడు. నేనెంతకును ఒప్పుకుంటిని. అయ్యెడ నొక యద్భుతశక్తి నన్నావహించి, నాచేతఁ గత్తియుంచి, వాని శిరస్సు తెగవ్రేయించినది. నా కాపిమ్మట నొడలు తెలిసినది. మహాపాతక మొనరించితి.

నను దండింపుఁడు మీరుఁ దోఁచినక్రియన్: మాతన్ బ్రియస్నేహితా
ళిని తక్కుంగల బంధువర్గముల నేలీలం గనం జాల; మ
ట్టనక క్రోధముఁ దీర్చువాఁడనని ప్రజ్ఞల్ పల్కితి న్నాఁడు; వా
నిని ధీర్పంగ నశక్తుఁడన్, గురువరా! నిర్వీర్యతన్ సైఁపుమా!

గురు : నాయనా! ఇదియంతయు దైవనిర్మాణము. ఇందు నీ తప్పేమున్నది? నీచిగాఁ డారీతిగాఁ జచ్చి శాశ్వత యశంబుఁ గాంచవలెననియు, ననఘ! హానిని క్రోధముఁ దీర్చుకొను నవకాశము నీవు శీఘ్రముగాఁ బొందవలెననియు, ఈశ్వరుఁడే ఆదేశించి యుండెను. ఒక యుంఛవృత్తిని నాయనను నీ కపారధనమ్ము లభించునని నీ జాతక చక్రము వ్రాసిన నాఁడే మీయమ్మతోఁ జెప్పితి. అది నేఁడు కలిగినది. నగ ప్రుడిగి ఆనిధిం గ్రైకొందువు గాని, రమ్ము (అనుపోతుని హస్తము పట్టి గోలెము కడ కేఁగుచుండగా బల్లు ఏంచుక పెల్లగించినంతనే గోలెము లేలికగా లభించును)

వత్సా! చూచితివా? ఆలక్ష్మి తన చేతులతోనే అందిచ్చిన దేమో యన్నట్లు లీగోలె మెంతసులువుగా లభించెనో, చూడు! (దానిని తెరచి) ఆహా! ఇదియంతయు స్వర్ణమయము! అన్నియు మేలిమి బంగారు నాణెములు!

ఇదె పృథ్వీస్థలి సమస్త భూతతతి నిన్నీక్షింప, నీ పూర్వికుల్
ముదమందన్, గనకాభిషేకరచనన్ ముంగోలు పట్టంపు నం
పదఁ జేకూర్చెద, శౌర్యధైర్యముఖసంపద్భ్రేష్ఠులం దెక్కురన్
గదనక్షోణిని జెప్పు మీధనముచేఁ గల్యాణమౌ, బాలకా!

[కొన్ని నాణెములు తీసి అనువానికిచ్చును]

అను: ధన్యోస్మి! ధన్యోస్మి! (నిష్క్రమించును)

సర: కుమారా! నీవిక నేచిగానిక్కడ నుండరాదు. వాఁడు మహా త్యాగరాజు. స్వర్గముఁ జూచుకొన్నాఁడు.

అను: రేచయ్య సన్నివరముల కోరినాఁడు— ఒకటి, తన గోత్రము మార్చికొనుట, రెండవది మాయింట నే పుట్టినను బాగుగనుఁ బెంచి ముందుగా నొక మాలదంపతులకుఁ బుత్త్రికచేసి, వారి యనుమతిని ఆ యుద్వాహము జరుపుట.

సర: ఇటుపైని మీఁది రేచర్ల గోత్రస్థు, మీవంశజు లెల్లరుఁ బంచమ కులోద్ధరణమ్మునకై పాటుపడెదరు గాక! ఈ ధనలక్ష్మితో నీవు నీ యింటికిఁబోయి మీ యమ్మను దక్కుఁగల బంధువులను ఆదరిం తువుగాక, రమ్ము.

(నిష్క్రమింతురు.)

## పంచమాంకము

### ప్రథమ రంగము

రంగము: రాజవీథి;

ప్రవేశము: పొట్టి రామన్న, సుబ్బయ్య.

రామ: సుబ్బయ్యా! మా నరసన్న భట్టునకుఁబట్టిన అదృష్టముం గూర్చి వింటివా?

సుబ్బ: నే నీనడుమ యాజ్ఞికమునకు కమలాపురము పోయితిని. ఆ కారణమున నాకే వార్తలును దెలియవు. ఏ మా యదృష్టము?

రామ: నరసన్న పొలములో నొక నిక్షేపము దొరికినదని విన్నావు గదా?

సుబ్బ: ఆ సంగతి విన్నాను. దానిని తన పెలమ మనుమని కే యిచ్చి నాఁడట కాదా?

రాము : అవును. ఆ ధనము వెలమ మనుమని పూర్వులు పాతిపెట్టి రంట, కనుక ఆ పిల్లవానిదే దానిహక్కంట.

సుబ్బ : ఆ ధన మెట్లు వినియోగించినాఁడు?

రాము : కొంత సేనను సమకూర్చుకొని, తాతగారితోఁగూడి మాయ వేషములు మాధవవర్మ రాజ్యములోఁ జొచ్చినాఁడు.

సుబ్బ : చొచ్చి యేమిచేసెను?

రాము : మొదట మిత్రభేదముఁగావించి, వర్మ స్నేహితుల నందఱ వశపఱచుకొనెను. ఆవల రాజ్యమంతయుఁబర్యటనముఁ గావించి, యసంఖ్యాక సేనానీకముఁ గూర్చుకొని నాఁడు.

సుబ్బ : ఆ సేనతోఁ యుద్ధము చేయఁగల్గెనా?

రాము : మహా శౌర్యముతోఁ దాడివెడలి, మొదట మొగులూరి దుర్గమును ముట్టడించి, మాధవవర్మ నోడించినాఁడు.

సుబ్బ : ఆ రణరంగమున నరసన్న కూడ నుండెనా?

రాము : ఉండకేమనునా? సపుత్ర బాంధవముగఁబోయి తోడు పడి నాఁడు

సుబ్బ : సహజ భీరుత్వముగల బ్రాహ్మణులు గదా, యెట్టులా రణావని నిలువఁగలిగిరో?

రాము : మా నరసన్న ప్రకృతిఁబట్టి కిరాతవానివలెఁగన్పట్టును. కాని, విలువిద్దెలో ద్రోణునంతటి వాఁడు. కృష్ణసూరి అశ్వత్థామ, కృష్ణయ్య కృపాచార్యుఁడు– అని చెప్పవచ్చును.

సుబ్బ : నాఁడు మనమందఱము గూడి వానిని వెలివేసినపుడీ సామర్థ్యములం గూర్చి చెప్పవైతివే !

రాము : అప్పుడు మా వెంకన్న జట్టులో చేరవలసి వచ్చెను.

సుబ్బ : ఇప్పుడు మరల 'మా నరసన్న' అని వెనుక వేసికొని వచ్చు మన్నావా?

రామ : అప్పుడు మతమును గూర్చి పట్టుదలలు వచ్చినవి. జ్ఞాతులము గాన, ఆ పట్టుదలలు నిలుచునా?

సుబ్బ : కాని మీరప్పుడు పెట్టిన త్రంపి యింతలో జ్ఞాతులని నేను దలంపలేదు. అప్పుడు నరసన్న బీదవాండు, ఇప్పుడు మహాధన వంతుండు. శత్రువులు, మిత్రులు తారుమారగు లగుట న్యాయ్యమే.

రామ : ధనమన్న ఆశలేని వారెవ్వరు?

సుబ్బ : సరే, ఇప్పుడు మీ ప్రాణమిత్రులు వెంకన్న, దీక్షితులు మున్నగు వారు తోంకలు ముడిచి రనుకొందును.

రామ : ముడువ కేమిచేయుదురు? దాని కేమిగాని, అనువోతుని గూర్చిన విశేషము లేంగనో, యిప్పుడో మా కృష్ణసూరి వలనం దెలియంగలవు. (నారాయణ శాస్త్రితో కృష్ణసూరి ప్రవేశించును) అదిగో, మాటలలోనే వచ్చినాండు మా కృష్ణసూరి. కృష్ణా! నీకు నూరేండ్లాయువు. విజయ వార్తలెల్లం జెప్పవేమోయీ?

కృష్ణ : మన యనువోతమహారాజునకుం బరిపూర్ణ విజయము కలిగినది.

రామ : అటు గాదు, నిన్ను నడుపుమన్నది. వివరించి చెప్పు—

కృష్ణ : మొదట మొంగులూరి దుర్గము మాకు వశమైనది.

రామ : ఆ వార్త విన్నాము.

కృష్ణ : తరువాత, ఇనుకుర్తి కోటను ముట్టడించితిమి. అందే 121 జాతుల చంద్రవంశపు రాజులు గలరు. మహారాజు వారి నెల్లర సంహరించుటం జేసి ఆతనికి 'సోమకుల పరశురాముండు' అను బిరు దిచ్చి రచ్చటి వారు.

నారా : ఆ బిరుదమిచ్చు సభలోనే కాంబోలు, మహారాజుచే గురువు గారు 'అయ్యనవోలు' గ్రామమును శ్రోత్రియుల కగ్రహారముగ నిప్పించిరి.

కృష్ణ : అవు నప్పుడే—అంత భువనగిరి, ఓరుగల్లు, పానుగల్లు, మెతుకు, గోలకొండ, రాజగిరి మున్నగు చోటులంగల కోట లన్నియు మన

విభుని వశమైనవి. భువనగిరి దుర్గములోఁగల సేనానాయకులందరు సభచేసి, అనుపోతునకు 'ఆంధ్ర దేశాధీశ్వరుండు' అని బిరుద మిచ్చిరి.

సుబ్బ: మన కంప్ప గొందుటం బుట్టి, యొక పేదబాలుని వలె మన యూరిలోఁ దిరుగుచు, నరసన్నగారియొద్దఁ గావ్య పాఠములు నేర్చుకొనుచుండు అనుపోతుఁ డెంత వాఁడయ్యెను!

కృష్ణ: ఆంధ్రదేశము నిక్షత్రియ మొనర్చు తలంపునఁగా ఆతఁడు సల్పిన సమర క్రీడ వర్ణింపఁదరము కాదు.

నాగా: క్షత్రియులకుఁ దోడ్పడిన రెడ్లలో నాయకులెల్ల మన ప్రభువే స్వయముగాఁ జంపియుండెనఁట. మాధవవర్మను గూడ అతఁడే శిరఃఖండన మొనర్చి, త్రిపురాధిగములోఁ దంత్రములకుఁ దిలోదకము లిచ్చెనఁట.

కృష్ణ: అంతయు నిజమే. దిగ్విజయయాత్ర ముగిసినది.

రామ: కృష్ణా! నరసన్నబాబయ్య యెక్కడనున్నాఁడు?

కృష్ణ: మహారాజునొద్ద రాజగిరి దుర్గ మందున్నాడు.

సుబ్బ: అక్కడ నేఁడేమి శుభకార్యములు జరుగునా?

రామ: సుబ్బయ్యా! నీ వృత్తి కనుగుణమగు ప్రశ్నయే వైచితివి. ఎక్కడెక్కడ శుభకార్యములు జరుగుచుండునో తెలిసికొనుటలో నీకు శ్రద్ధమిక్కుటము.

కృష్ణ: అట్టిశ్రద్ధ యుండవలసినదే. రాఁగల మాఘమాసమున మహారాజునకు వివాహము ముందుగా జరుగును. పిమ్మట ఉగాది నాఁడు, బాచకొండకోటలో అతనికి పట్టాభిషేకము నిర్ణయించినారు.

సుబ్బ: ఆ మహోత్సవాలకు మమ్ము మఱచి పోకుసుమా!

కృష్ణ: అంతయు ప్రభునాజ్ఞను బట్టి నడుచును.

సుబ్బ: ప్రభువు మీ చేతిలోని వాఁడే కదా!

రామ: అట్లన వీలుగాదు. 'అడ్డాలలో నున్నప్పుడు బిడ్డలు గాని, గడ్డాలు వచ్చిన తరువాత బిడ్డలా?'—అన్నట్లు, ప్రభువు పెద్దవాఁడై యింగితజ్ఞుఁడై యుండఁగా నొరులకు స్వాతంత్ర్యము ఉండునా? కృష్ణా! అనుమోతుని పెండ్లి యంటివే, దానికి ముందు మాలవాండ్రకుఁ బెండ్లి సేయుదురా?

కృష్ణ: తప్పక చేయుదురు. మాదిగాని మనుమలలో నొకనికిఁ బెండ్లి నిశ్చయించితిమి. వారి యుపయోగములో నుపయోగించిన మంత్రాలు అనుమోతుని కుపయోగింతుము.

సుబ్బ: మాలవాండ్రు ముట్టుకొన్నదే?

కృష్ణ: అవును. వారు ముట్టినంత మాత్రాన గంధములు పాడైపోవునా? ఛాందసపు టాచారాలు కట్టిపెట్టుఁడింక.

సుబ్బ: మా యాచారము లిప్పుడు మారవు.

కృష్ణ: మూఢాచారాల పట్ల ప్రభువులే శాసనము కలుగఁజేసికొని మాన్పింప వలయును.

రామ: ఆచారముల మాట కేమిగాని, అనుమోతున కెవరిపిల్ల నిత్తురు? ఆ కథ యంతయుఁ జెప్పుము.

కృష్ణ: రాజగిరికి ప్రక్కనుండు పల్లెలో, వెలినాటి మాధవరాయ గారను నొక ఘనుఁడు, చిన్న జమీందారుఁడు కాఁపురమున్నాఁడు. అతఁడు తురుష్కులతోఁ బోరిపోరి విసిగియున్నాఁడు. అంత భాగ్య గతించినది. మాధవరాయునికి వైరాగ్యము కలిగి యుద్ధ క్రీడలు మాని, ఒక పల్లెలో ఒక ఆరామ మేర్పరుచుకొని, దాని నడుమ నొక యిల్లు కట్టుకొని, ముని వృత్తితో జీవనము చేయుచున్నాఁడు. అతని కొక్కతెయే కూఁతురు, చక్కని చుక్క, మంచి గుణముల కిక్క. యుద్ధానంతరము మన యనుమోతుఁడు వేఁటకుఁబోవ బుద్ధి పుట్టి, ఆ పల్లెయ ప్రాంతమునకుఁబోయెను. చెలికాండ్రు త్రోవతప్పిరి. అనుమోతుఁడు పిపాసాప్రేరితుఁడై యా యారామ గృహమునకు పోయినాఁడు. అప్పుడు మాధవరాయఁ డింటలేఁడు. సీతమాంబ

గుణశీలలఁ దేఁగా యున్నది. అనవోతుని కాన్పించి మోహాంకురించినది. శకుంతలా దుష్యంతులవలె వారు పరస్పరానురాగముతో నుండిరి. అనవోతుఁడు మృగయావ్యాజమునఁ బలుమా రచ్చటికిఁ బోవుటకు సదాశివరాయని యనుమతిఁ బొందినాఁడు.

రాము : కృష్ణా! అనవోతునికి మంత్రి యెవరు?

కృష్ణ : అతని కతనియందు విశ్వాసముండునో వాని నతఁడే యెన్నుకొనును.

రాము : ఇంతటి నిస్సహాయుని పెంచి, పెద్దవానిఁ జేసి, చదువుఁ జెప్పి, తన శిష్యులలో వారికిని ప్రాముఖ్యతయు నిచ్చి, నిరుపమాన విజయము నిప్పించి, భువనసామ్రాజ్యము చేకూర్చిన మీ నాన్నగారికి, దక్కుంగలి పాణి సర్గమునకును పాలివోసికమును లిత్తురా, గురాయరా?

కృష్ణ : పోరా! ప్రత్యుపకార మపేక్షించి నాన్నగా రుపకారము చేయుట నీ వన్నఁడేని చూచితివా? అనవోతునికిఁ బట్టముగట్టి, తాను, మనుమలు నహా శిష్యులకుఁ బాఠాలు చెప్పుచు, వ్యవసాయ వృత్తిని సంపాదించు చేయఁగోరుచున్నారు. నాఁడు చాణక్యుఁడే ప్రయాసపడి చంద్రగుప్తుని సింహాసనాధిష్ఠునింగావించెనో, మొన్న మొన్న మాధవవిద్యారణ్యులే లాభమునుంగాక్షించి రాయలవారిని విద్యానగర ప్రభువుగా నిలిపిరో, అట్టిప్రయోజనమే నా తండ్రియు అభిలషించును.

సుబ్బ : రామన్నా! నీ శరీరమువలెనే, నీ బుద్ధియుఁ బొట్టిగా నున్నదే! నరసన్నకు ధనాపేక్షయే యున్న, నిధిలోని ధనమంతయుఁదానే గ్రహింపఁడా?

రాము : నిజమే. కాని, యనవోతుఁడు మా వింజమూరి వారికి పురోహితత్వమేని ఇయ్యఁడా?

కృష్ణ : అతని పురోహితమును గోరు మన మొల్లరము—అన్ని కుటుంబములవారమును—అతని పురోహితులమే. ఓరీ! రామన్నా! ఇంక వెంకన్నను మత్సరము మాను మనుము. పట్టాభిషేక మహోత్స

వాలకు రమ్మనుము. (కృష్ణసూరి 'నారాయణశాస్త్రి') లోకి పంపి, రామన్న సుబ్బయ్యగారు లోకి వంకను బోవుదురు)

## ద్వితీయ రంగము

రంగము : రాజగిరి కోటలోని ఉద్యానవనము.

ప్రవేశము : సోఫాలపైఁ గూర్చుండి, సీతా శీలవతులతో అనుంగు రాజు.

శీల? శ్రీ నరసన్న భట్టారకుని యవ్యాజ కరుణచే మనకోర్కెలు సిద్ధించినవి. నే నేయాశయముతో నింతదనుక జీవించియుంటినో, యది నెఱవేఱినది. ఇంక నానందముతోఁ జిరకాల వియోగ సంతప్తులై నాకొఱకు నెదురుచూచు మీ నాన్నగారి కడకేఁగెదను.

అను: అమ్మా! అదేఁటిమాట? "మొలక స్ఫుటించుట గావలయు, శాఖోప శాఖలయి యది ప్రవృద్ధిఁ గాంచవలయు" అని కదా మా నాన్నగారు నిన్నాదేశించిరని నాతో నుడివితివి! ఆయన యాజ్ఞ పూర్తిగాఁ జెల్లింప వలదా? అదిగాక, నేనొక సామాన్య పద్మనాయక కులజుఁడనని మాత్రమే నమ్మి, నాయందు గాఢమగు వలపు నిలిపి, నాచెట్టఁబట్టిన నీయుక్కోడలికి నీవన్నిట మార్గదర్శివై యుండి, నీతులు గఱపవలదా?

శీల: మీరిరువురును సీతారాములవలె నన్యోన్య ప్రేమవహించి నూరేండ్లు మనుఁడు.

అను: అమ్మా! జనకుఁడు నాకముఁబట్టి చనినను, కుమారుని విడువక యుండు కౌసల్యవై నీ వున్నప్పుడు గదా, మేము సీతారాములమై యుండఁగలుగుట?

శీల: (బుజ్జగించుచు) వెఱ్ఱితండ్రీ! అటులేయుండును లెమ్ము. అమ్మా! సీతా! మా యదృష్టవశమున నీవు కోడలివైతివి. జనకరాజర్షి తుల్యుఁడైన నీ జనకుఁ డన్నినీతులను నీకు బోధించియే యుండి యుండును. నేను వేరుగఁ జెప్పను. కుమారా! నీ పట్టాభిషేక మహోత్సవము జరుగఁబోవు వినోదాలెవి?

అను: ఆవియెల్ల తాతగారును, కృష్ణసూరి మామగారు, కృష్ణయ్య బావగారును మువ్వురు. భారమంతయు వారికే విడిచితిని.

శీల: నాయనా! మంచిపని చేసితివి. ఆ మహానుభావులే సర్వసన్నాహముల నేర్పఱచెదరుగాక.

(ప్రవేశము — నరసన్నభట్టు)

బాబయ్యగారు కూడ సమయమునకే వచ్చిరి.

అను: ఆర్యా! సన్నాహములన్నియు ముగిసినవా?

నర: సైన్య భాగము ముగిసినది. సంస్థానములయొద్ద చిరకాలము సేవ జేసియున్న రాజకార్యదక్షుల నెక్కండ్ర సంపాదింపఁ గల్గితి. అంతేగాక, నీ పూర్వుల కొలువులో వర్తించిన మహిత విశ్వాస పరులఁ గొందఱఁ గొనివచ్చితిని. వారలనెల్ల వివిధశాఖల కధికారులుగా నియమించితిని. విధిలేక మాధవవర్మ కొలువులో నుండియు మన శ్రేయస్సుఁ గోరు ఘనులఁ గొందఱఁ జేరఁదీసితి. ఒక్క ప్రధాన మంత్రిని మాత్రము నియమింప వలసి యున్నది.

అను: ఆపదవికి కృష్ణసూరి మామగారే తగుదురు. కృష్ణయ్య బావగారు కార్యదర్శిగా నుందురు. నారాయణ శాస్త్రిగారును మా కులమునకు ఆస్థాన కవులుగా నుందురుగాక!

నర: నాయనా! అంతయు సరియేకాని, మంత్రిపదవికి వేరొక్కనిఁ జూచుట మేలేమో యాలోచింపుము.

అను: ఆలోచించితి. ఆయన సన్నిధి యుండి తీరవలయును. సహృదయత్వము గలవారు మారెవ్వరుందురు?

నర: సరే. నీ వివాహకథ, సీతారామ వివాహకథయు, ప్రతిపద్యము నందును వచ్చునట్లు ఒక ఆంధ్రద్వ్యర్థికావ్యము నారాయణకవి రచించినాఁడు. దానిని నీకే కృతిగా సమర్పింపఁదలఁచినాఁడు. మన సోమేశము "యాదవరాఘవీయ" మను ద్వ్యర్థికావ్యమును సంస్కృతమున రచించినాఁడు. అదికూడ నీకు అభిషేక సమయాన అతఁడర్పించును.

అను: తాతగారూ! నాదొక్క మనవి యున్నది. దానిందీర్పఁగోరుచున్నాను. ఇప్పుడు మనము సంపాదించిన రాజ్యములో మా తండ్రిగారి రాజ్యము నాకిచ్చి తక్కుంగలయది మీరే స్వీకరించి, దానికి కృష్ణసూరి మామగారి నేలికగా నేఁజేయరాదా? ఆరీతి నాదరింపుఁడని నా ప్రార్థన

నర: నాయనా! నీకోరిక సముచితమే; కాని.

కవి సూరిజన గాయకవిహంగముల్ మురిఁగి
వసతులొంది సుఖజీవనముగనఁగ,
దారిద్ర్యదుర్భరాతప తాపమున కోడు
పాంథ దీనతతికి స్వాగతమిడ,
అన్యశరణ్యసూన్య లతాలతాంగులు
సాఁచుకేల్వల శ్రాంతియడఁప
ఆశ్రిత భూతచయమునకుఁ బ్రతిఫలా
పేక్షరహిత ఫలబృందమీయ,

రావువంశ కల్పక వృక్షరాజమొండు
బ్రహ్మదేవుఁడే సృజియించెఁ బరమకరుణ:
దానిధర్మంబు సామాన్య దర్భదళము
దాల్ప శక్యంబె? హాస్యాస్పదంబుగాదె?

కావున, బాబు! మాకు రాజ్యమువలదు. తప్పక నీచే తద్భారము వహింపవలయును.

అను: మీరు రాజ్యభాగము స్వీకరింపకున్న, నే నేవిధమున, ఋణవిముక్తిఁ గాంచఁగల్గుదును?

నర: అలాగైన, మీ రాజ కుటుంబమునకు మేము శాశ్వతముగాఁ బురోహితులమై, ప్రధాన గురుస్థాన మలంకరింతుము, లెమ్ము.

అను: అంత మాత్రమున నాకుఁ దృప్తి తీరదు. మా రాజత్వముతోఁ బాటు, మీ వంశమునుండి యొకని మంత్రిత్వమును శాశ్వతముగా నిలువ నిండు.

నర: నీ చిత్తమునకుఁదోఁచినట్లే యగుఁగాక!

అను: కృతార్థుఁడను.

కణ్వ: మాకును హితులగు రాజుల నెల్ల నాహ్వానించితిమి. వారి కుచిత ములగు ధనసముల నొసఁగులుగా నేర్పఱచితిమి. కళ్యాణదినములలో [illegible] వారికి నవిచ్ఛిన్నాన్నదానము జరుగు సన్నాహ ములఁ జేసితిమి. నీ పూర్వుల గద్దియ సిద్ధ పఱచినాము.

శో: భాగ్యయ్యగారూ! మా నాయన యథావిధి తన ధర్మములు నెఱపఁగల్గుటకుఁ దగినయుపదేశము లీయ వేఁడెదను.

కణ్వ: నేను జీవించునంత కాలము మీతోనే యుందుఁగదా? ఎప్పుడే యుపదేశ మగత్యమో, అప్పుడది యుక్తముగ నిచ్చుచుందును. అయినను, సందర్భమునకు సముచితము లగు కొన్ని యంశములఁ జెప్పెద. నాయనా! వినుము.

కమ్మఁగొను మల్లె పింజ నిరాయి మరంద ధనమ్ము నెల్ల మె
ల్లన మధుపాళి యేక్రియ విలాసగతిన్ గ్రహియించునో, చిరం
తన సహకారుతై వెలయు తత్కులహంస లోకించు కేని, త
త్ఘనము సుభుక్తిగాంచ కెటు దప్పఁగఁ బోవునో, నిస్పృహాత్ములై

యల సహకారభూజ మెటులంచిత సత్ఫల శోభితమ్ముగా
వెలసియు, గర్వ సంకలిత వేషముఁ దాల్పక, నమ్రభావమున్
దెలిపెడు పైఁ బరింగనునొ? దిమ్మరి యొక్కఁడు రాలు రువ్వ ని
శ్చలమతి నుండి యెట్లు ఫలసంఘ మొసంగునొ, గాంచియుంటివే?

కుమారా! యింగితజ్ఞుఁడవగు నీవు దీని భావ మెఱిఁగి వర్తింపుము.

సీతాదేవి! నీకుఁగూడఁ గొన్నిమాటలు చెప్పవలతును. వినుము.

లతిక వీ, పతిఁ దవలంబ దండ మగును,
ద దనుసరణమె నీ ధర్మమగును
తమ్మి వీ. పతిఁడు తత్సఖుఁడు, సదా వికా
సము వహించుటె నీకు సౌఖ్యమగును,
పిడవీ, పతిఁడు విష్ణెందు దీపంబు, త
దను గమనంబె నీ న్యాయమగును,
అల చకోరమ వీవు, నెల యతం, డెపుడు తత్
ప్రేమ సుధలఁ గ్రోలఁ బ్రీతి యగును,

అను : హంసరాజ మెటులుండె, రాజ్ఞి యెటులున్నదో చూచితివా?

ఆత్మనాథుండు సభఁదీర్చ నరిగియుంట
స్వీయపరిచారికా పరివేష్టిత యయి
యొక్కకమలాసనంబందు నొప్పుబొలుక
నంచరాణి యె ట్లుపవిష్టయగునొ, కంటె?

సీత :

పద్మపత్ర శయ్యాస్థలిం బవ్వళించి
కపటనిద్ర నటించు నిజపతి నెట్టు
లమ్మరాళ భామిని ప్రబోధమ్ముసల్పి
వెనుకకేఁగునో విఫలయై ! కను మహీశ !

అను : నిద్రించువారిని మేల్కొలుపవచ్చునుఁగాని, నిద్దురనటించువారి నెవ్వఁడు ప్రబోధింపఁగలఁడు? ఆవంకఁ జూతుము.

తన్ను వెంబడించి తటిమితటిమి వచ్చు
పోఁతు బాతును గికురించి, లోఁతునీళ్ళ
మునిఁగి, వెంటి యేగతి గెంటి చనునొ, కనుము !
కాంత కిష్టంబులేకున్నఁ గార్యమగునె?

సీత : పురుషుల యిష్టాగ్రహములు స్త్రీలు సాధింతురు. కాని, పురుష రాగము హెచ్చుకుండుట యెన్నఁడేని గలదా?

మందమలయానిలకుమార మాంత్రికుండు
మంతరించుటఁ గాఁబోలు మైకమంది
కొమ్మ లవె మిమ్ముఁ గరపల్లవమ్ము లలర
రమ్మని పిలుచుచున్నవి రాకుమార !

అను : అట్లయినచోఁ గరము కరమునఁ గీలించి మన మొండొరులము విలాసగతి నాకొమ్మల డెందమ్ముల సలరింప నేఁగుదము—పద.

(నిష్క్రమింతురు)

## తృతీయరంగము

రంగము : రాజవీర మున్నుమూరి సభాగారము. అది సింహాసనాదులచే నలంకరింపఁబడి యుండును.

ప్రవేశము : కృష్ణమూర్తి, కృష్ణయ్య, నారాయణశాస్త్రి, సామంతరాజులు, [illegible]

కృష్ణ: సభ్యులారా! శ్రీ యనువోత మహారాజు పట్టాభద్రులై సింహాసనాధిష్ఠుండయ్యెడు శుభముహూర్తము సమాసన్నమైనది. అదె మంగళ వాద్యంబులు మ్రోగుచున్నవి. (బాకాలు వినిపించును) అదిగో, మహారాజు సపరివారుఁడై దేంచుచున్నవాఁడు. నిశ్శబ్దము! నిశ్శబ్దము! (స్వస్తివాచకుల వేదఘోషవినఁబడును — తెరలోని వందిమాగధులిట్లు పలుకుదురు)

"శ్రీ రేచర్ల వంశ విక్రమాదిత్య! రేచర్లప్రాంత దండ్రోగజమా! గోన మల్లారెడ్డి రణభూత బలిహారణా! మంగళపుంజి గుర్విరెడ్డి రణరంగ మర్దనా! రావువరపు మల్లారెడ్డి భుజాస్ఫోటనా! పాలూరి పోలారెడ్డి రణనిర్ధూమధామా! బండి కోటారెడ్డి రణభుక్తిఖడ్గ భేతాళా! వినుకొండ మారారెడ్డి ప్రాణవాయు హరణ కరవాల క్రూరసర్ప! కుట్లూరి మారారెడ్డి కంఠనిదళన ఖడ్గభైరవ కరవాల దంష్ట్రా! అరవపల్లి గాదిరెడ్డి ఘోరాటవీదావాగ్నికీలా! కొత్తపల్లి కొండారెడ్డి ప్రాణాపహారా! మహారాజ రాజా! మార్తాండతేజా! ఆశ్రితకల్పభూజా! శ్రీ యనువోత భూపాల బిడౌజా! జయము, జయము, దిగ్విజయము!"

(సభ్యులెల్లరు లేచి నిలుతురు. మహారాజు నరసన్నభట్టు కవిసమేతుఁడై సభాగారముం జేరును)

నర: సభ్యులారా! నేఁడు మిగులఁ బుణ్యదినము.

"అకలంక పద్మనాయకవంశ రుచిరము
క్ష్మావళీ తరళంబు రావుకులము
బాహాగ్రజాగ్రత్కృపాణ ధారాహత
ప్రబలవైరిబలంబు రావుకులము
భానుసూనుసమాన దానసంతోషిత
ప్రకటార్థిపటలంబు రావుకులము
విమలకీర్తి ప్రభావిజిత సితాంభోజ
రాజహంస కులంబు రావుకులము

పరమభక్తి ప్రపూజిత హరిగిరీశ
రమ్యచరణాబ్జ యుగళంబు రావుకులము
సకలసంశ్రిత పండిత సత్కవీంద్ర
రచిత సుకృతాయత ఫలంబు రావుకులము"

వృతలక్షణ సూచకే శ్లేషమహాకావ్యే [illegible]
సర్వం సంపూర్ణమ్.

(సోమేశము కృతినందించును. [illegible]
సభ్యులు కరతాళ ధ్వనులొనరింతురు)

నర : శ్రీయనువోత భూపతేంద్రుని వివాహకథయు, శ్రీ[illegible]
కళ్యాణ కథయుఁ బ్రతిపద్యమున నిమిడ్చి, నా[illegible]
ద్వ్యర్థికావ్యమును, నిస్తుల[illegible] రచించితిను. [illegible]
ములకై [illegible] సంకీర్త [illegible]
రెండు మూఁడు పద్యములు మాత్రమే చదివి [illegible]
డగునుగాక !

నారా : అనయంబున్ దనవిష్ణు ధర్మమును జేయుండాల కాత్మాంశమున్
గొని రాజప్రకరంబులఁ బనిచి, శ్రీలోలాక్షికో నిత్య నూ
తన సంతోష వినోదముల్ గనెడు దైత్యధ్వంసి నారాయణుం
డనువోత ప్రభుచంద్రుఁ బ్రోచుత సమస్తైశ్వర్య సంధాతమై.

షష్ఠ్యంతములలో నొక పద్యము మాత్రమే చదివెద.

సకల విరోధి శిరఃకం
దుక కేళీ విరచిత పరితోషునకున్ బూ
ర్ణకళాంచిత వేషునకున్
నికర గుణయుతానువోత నృపభూషునకున్

అభ్యుదయ పరంపరగా నాగెమొనర్పం బూనిన సీతాకల్యాణంబను
ద్వ్యర్థి కావ్యమునందలి కథాక్రమం బెట్టిదనిన——
(కృతినందీయఁ బోవును)

ఒకసభ్యుఁడు : కవీంద్రా ! మీ కావ్యమందు [illegible]
మొక్కదానిని గూడఁ జదువఁగోరెదము.

నారా : ఆరీతిగాఁ జదువుట సంప్రదాయ విరుద్ధము. అయినను మీ
కోర్కె త్రోసిపుచ్చక చదివెద. గురువులు మన్నింతురుగాక !

జనకుని సమ్మతిఁ జకలసద్గుణ రత్నకదంబ సీతయాం
బ నిఖిల దుష్టనక్తచర భంజనుఁ డావనరంజనుండు రామాం
బునిధి విలాస సంచరణ శోభితము భూమివసింహపోతమున్
అనుపమలీలఁ గ్రాలి నుహనూమదుదధిం గయిదమ్మి వట్టెడున్

